ద్రవాన్ని పోయండి. పర స్త్రీ కుచములపై నఖాంకురాలుంచారు, వీరి గోళ్ళల్లోను, కళ్ళలోను అనుపసూదులు దింపండి. ఇతరుల భార్యల ముఖాలను ముద్దుపెట్టుకొన్న వీరి ముఖాన ఉమ్మి వేయండి. మగనాలి ఇంటికేగి హీనంగా ప్రవర్తించిన ఈ దుండగులని కాళ్ళు నరకండి. పర స్త్రీల యందు కామాసక్తితో చూచిన వీరి కెంపలు వాయగొట్టి వాతలు పెట్టండి. హృదయంలో కత్తులు గ్రుచ్చండి. ఇతరులకు బాధ కలిగించేటట్లు నిష్ఠురంగా మాట్లాడినవారిని మంగలంలో పడవేసి వేయించండి. ఇతరుల యందు అసత్యదోషం ఆరోపించిన ఈ అలుడిని అభాయంతో కాలిన మాంసపంకంలో పడవేయండి. గురునింద చేసిన దుష్టుని నోట మహా ద్రావకం పోయండి. ఇలా శాసిస్తూ, పాపాలుచేసిన వాళ్ళను వాటి కను గుణంగా శిక్షలు విధిస్తుంటాడు.

రౌరవం, మహారౌరవం, కాలసూత్రం, కుంభీపాకం, అంధతా మిస్రం మొదలయిన నరకా లున్నాయి సుమా! శిశువులను చంపిన వాళ్ళను, కృతఘ్నులను గురుభార్యతో సంగమించిన వాళ్ళను, గోహత్య కావర్చిన వాళ్ళను, మిత్రులను సంహరించిన వాళ్ళను, ఇతరుల ధనమును, పొలములను, గృహాలను అపహరించే వాళ్ళను, కూటసాక్షులను, బ్రాహ్మణ హత్యలు చేసినవాళ్ళను కాల్చిన వృక్షాలు ప్రాకించి తలక్రిందులుగా ప్రేలాడదీయించి, చీకటి బావులలోకి నెట్టి, ఇనుప ముక్కులుగల కాకుల చేత పొడిపించి, అనేక విధాలుగా బాధలకు గురిచేస్తారు.

ఎవరు హరివాసు కీర్తనం చేస్తారో వారికి నరకబాధ ఉండదు. శివభక్తులను, విష్ణు సేవాపరాయణులను బాధింపరాదని ఒకప్పుడు యముడు తన కింకరులతో కఠినంగా చెప్పాడు.

గోవింద, గంగాధర, బాణాసురమర్దన, చంద్రాంకధర, వాసుదేవ

విష్ణుపార్షదులు ఇలా వివరిస్తుండగానే దివ్యరథం సూర్యలోకానికి చేరువయింది.

## సూర్యలోక వర్ణనం

అప్సరోలోకపు వింతలు చూసి ఆశ్చర్యపడిన శివశర్మ ముందుకు చూస్తున్నారు ఇంతలో ఒకేచక్రం,ఏడుగుర్రాలతో ఉండి, కొందరుఅప్సరసలు మునులు గంధర్వులచే అధివసింపబడిన ఒక రథం అటువైపుగావచ్చింది. శరీరంలో ఊరుభాగంలేని అనూరుడు రథం తోలుతున్నారు. దుర్నిరీక్ష తేజోరాశియైన ఆ కర్మసాక్షిని చూడటంవల్ల కనులున్న ఫలించిందనుకొని శివశర్మ రెండుహస్తాలు ముకుళించి నమస్కరించారు. కింకరులు శివ శర్మతో మహాత్మా! లోకోపకారి సూర్యభగవానుడి రథమిది. ఆ దేవుని పితృలు నిష్కల్మషమైన అర్ఘ్యతోయం, దేవతలు విధ్యుక్త ధర్మప్రకారం అర్చిస్తారు. చారణులు అతులకవిత్వధారతో స్తుతిస్తారు. కిన్నరులు గీతాలతో స్తోత్రంచేస్తారు. గరుడులు నమస్కారపరితోషం రాక్షసులు గాఢ భక్తితో సేవచేస్తారు. పాతాళవాసులంతా ఏకాగ్రతతో ఆస్వామిని ధ్యానిస్తారు.

సూర్యదేవుడెంతో స్థిరమైనవాడు కాదు లోకంకోసం సంచారపరతంత్రు డయి ఉంటాడు. తాను చైతన్యం కలుగజేసేవాడయినా లోకులందు దుఃఖహారుడుగా వెలుగుతుంటాడు. మోక్షం ఇచ్చేవాడే అయినా ముక్తి కృతులకు నిరాకారమైన సిద్ధి ప్రసాదిస్తాడు. అనంతకాలంలో వర్షాన్ని కురిపించే వారిలాగ కిరణాలతో లోకాన్ని మార్చివేస్తాడు. తూర్పున ఉదయాద్రిపర్వతమంత ఔన్నత్యంతోబాటు అధికతేజస్సు కలిగి ప్రకాశిస్తుంటాడు.

ఆ మాటలు వింటున్న శివశర్మ ఆ కర్మసాక్షికి నమస్కరించారు.

రెప్పపాటు కాలంలో ఆ మూర్తి రెండువేల అయిదువందల యోజనాలు ప్రయాణించాడు. బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి మాటలతో అయ్యా! సూర్యబింబంలో ఒక మహా పురుషుడుంటాడని పండితులు అంటారు. సిద్ధులయిన వాళ్ళు ఆ పరమపురుషుని ఎలా సేవిస్తారు. అని అడిగాడు.

దానికి కింకరులు ఇలా అన్నారు. ఆకాశముమధ్యలోనున్న సూర్య బింబం లక్షయోజనాల వైశాల్యం గలది. ఆ బింబం మధ్యలో తలపైన తెల్లని కిరణాలు ప్రసరిస్తూ అద్భుతవిద్యుత్ ప్రయోగపూర్ణమైన బంగారు రూపుడు, బంగారు కేశములు గడ్డములు కలవాడు, చేతులు మొదలయిన సమస్త అవయవాలు బంగారంలాగనే ఉన్నవాడు విష్ణుదేవుడని, ఆయనకు తనకు భేదంలేదని, సూర్యోదయసమయంలో గాయత్రితోకూర్చి అర్ఘ్యమిచ్చే సమయంలో బ్రహ్మోపాసనాపరుడు నిర్మలమైన మానసంతో ధ్యానంచేయాలి. కాలక్షేపం చేయరాదు. కాలంకంటే ఎల్లరు ఎదురుచూచేది, ఆయాకాలా లలో మాత్రమే ఓషధులు ఫలిస్తాయి. నిర్ణీతమైన కాలంలో తప్పచెట్లు పూలుపూయవు. కాలం అనుకూలమయినపుడే మేఘాలు వర్షిస్తాయి. మందేహరాక్షసనాశనార్థం, త్రికాలములలో ఉపాసకులు విడిచిన, గాయత్రి మంత్రంతోకూడిన, మూడు అర్ఘ్యములను మిత్రనామకుడు కోరుతుంటాడు. కాలం తప్పకుండ ఉపాసించినవారికి ఆయురారోగ్యాలు ప్రసాదిస్తాడు.

పదునెన్మిది విద్యలలో మీమాంస మహనీయమైనది. మిక్కిలి ఉదాత్తమైంది. మీమాంస కన్న తర్కం పెద్దది. తర్క శాస్త్రంకంటె వేదములు మహత్తరమైనవి. వేదాలకంటె ఉపనిషత్తులు మేలయినవి. ఉపనిషత్తులకంటె గాయత్రి మహిమ గొప్పది. గాయత్రి అనే పాలకడలి ఓంకారమనే దూడతోకూడి నిరంతరం అమృతధారలు

ఉన్నది. మంత్రాలలో గాయత్రి, పట్టణాలలో కాశి, దేవతలలో చంద్రశేఖరుడు ఎన్నతగినవారు.



తనను గానంచేసినవాళ్ళను రక్షిస్తుంది కనుక అది గాయత్రి అయింది. ఇతర మంత్రాలకు దీనికిగల మాహాత్మ్యంలేదు. కనుకనే బ్రహ్మమీమాంసకులు ఉదయం సాయంత్రం జ్యోతిర్మూర్తి అయిన సవితృదేవుని సేవిస్తారు. గాయత్రే పరబ్రహ్మం, దానికధీశ్వరుడు సూర్యభగవానుడు.

వేదమూర్తిఅయిన కమలాప్తునికి ఎన్నోపేరులున్నాయి. హంసుడు, భానుడు, సహస్రాంశుడు, తపనుడు, తాపనుడు, రవి, వికర్తనుడు, వివస్వంతుడు, విశ్వకర్మ, విభావసుడు, విశ్వరూపుడు, విశ్వకర్త, మార్తాండుడు, మిహిరుడు, అంశుమంతుడు, ఆదిత్యుడు, ఉష్ణగుడు, సూర్యుడు, అర్యముడు, బ్రధ్నుడు, దివాకరుడు, ద్వాదశాదిత్యుడు, సప్తహయుడు, భాస్కరుడు, అహస్కరుడు, ఖగుడు, సూరుడు, ప్రభాకరుడు, శ్రీమంతుడు, లోకచక్షువు, గ్రహేశ్వరుడు, త్రిలోకేశ్వరుడు, లోకసాక్షి, తమోరి, శాశ్వతుడు, శుచి, గభస్తి, హస్తుడు, తీవ్రాంశుడు, తరణి, కిరణుడు, తార్క్ష్యవాహనుడు, దిక్పతి, పద్మినీనాయకుడు, కుశేశయకరుడు, హరి, మహావతి, ద్యుమణి, హరిదశ్వుడు, అర్కుడు, భానుమంతుడు, భయనాశకుడు, ఛందోశ్వుడు, వేదవేద్యుడు, భాస్వంతుడు, పూషుడు, వృషాకపి, ఏకచక్రరథుడు, మిత్రుడు, మందేహారి, తమిస్రహరుడు, దైత్యహరుడు, పాపహర్త, ధర్ముడు, ధర్మప్రకాశకుడు, హేళి, చిత్రభానుడు, పూర్వకర్మ. దుర్నిరీక్షుడు, అరుణుడు, కశ్యపాత్మజుడు మొదలైనపేర్లు ప్రసిద్ధమైనవి.

మోకాళ్ళు భూమిపై ఆనించాలి. రెండు చేతులయందు నీటితో నిండిన తామ్రపాత్ర ధరించాలి. ఆ నీటిలో దర్భాంకురాలు, అక్షతలు, ఎర్రచందనం, గన్నేరు మొదలయిన ఎర్రపూలు ఉంచాలి. పైనచెప్పబడిన

నామములకు ప్రతిదానికీ మొదట ఓంకారము, చివర నమః అను పదంచేర్చి, నామమును చతుర్థీ అంతంచేసి-ఓంసూర్యాయనమః, ఓంరవికిరాయనమః- ప్రతినామం ఉచ్చరించేటప్పుడు అర్ఘ్యపాత్రను పైవరకుఎత్తి, సూర్యదేవునికి అర్ఘ్యంసమర్పించాలి. సూర్యుడు సంతుష్టుడై ఆయుష్షు ఆరోగ్యం, బుద్ధి, ఐశ్వర్యం, ప్రాభవం కలుగజేస్తాడు.

అకారాది క్షకారాంతంగల ఏభై అక్షరాలు ప్రకృతిగా గలిగిన మంత్రరాజం మిక్కిలి రహస్యమైనది. అది మాతృక. ఈ మాతృక అయిదు అవయవాలతో పుట్టింది. దానిలో అకారానికి, ఓంకారానికి, మకారానికి, బిందువుకు, నాదానికి ఒక్కొక్కదానికి పదేసి అక్షరాలు లభించాయి. అట్టి ప్రణవమనే బంగారుపు గద్దెమీద, ఓంకారమనే మాణిక్య పదకం మెడలోధరించి వేదమాతయైన గాయత్రి విరాజిల్లుతుంటుంది. ఇరవై నాలుగు తత్వాలకు నివాసమైన గాయత్రీమంత్రం మన కోరికలను తీరుస్తుంది. ఆ సావిత్రీ స్వరూపం వివరిస్తాను వినవలసింది.

ఆ తల్లికి మూడువేదాలు మూడుపాదాలు. అదిపురాణసమూహం నాభి. నాలుగురిక్కులు నాల్గునేత్రములు. లోకమే శరీరం. ఆకాశం ఉదరం. ధర్మశాస్త్రం హృదయపద్మం. ఛందస్సులు స్తనాలు, సాంఖ్యశాస్త్రాలు చెవులు. అగ్నిముఖము. శిక్ష మొదలయిన వేదాంగాలు అంగుళులు. అథర్వణవేదం చేష్ట. శిఖముడి, బ్రహ్మశిరస్సు, శ్రీహరిఆత్మ, మీమాంస భావలక్షణాలు.

అగ్నిరేఖవలె ఈ గాయత్రి పాతకాలను దహింపజేస్తుంది. బ్రహ్మజ్ఞానసంపన్నుడు, గాయత్రీమంత్రాన్ని ప్రతిలోమంగా ఉచ్చరిస్తూ శత్రువును గూర్చి అభిచారహోమంచేస్తే, అది బ్రహ్మాస్త్రమై చిటికకాలంలో శత్రువుని దహింపజేస్తుంది.

గాయత్రియే విష్ణువు, గాయత్రియే శివుడు, గాయత్రియే బ్రహ్మ. త్రిమూర్త్యాత్మకమైన ఆదిత్యుడును గాయత్రియే. ఆ దేవిని స్తోత్రించేవారు ముక్తిని పొందగలరు. ఆ మహాదేవికి గాయత్రి, సావిత్రి, విశ్వజనయిత్రి, చతుర్వేదమాతా, పరాపరబ్రహ్మయుగం అనేవి నామాంతరాలు.

ఈ విధంగా విష్ణుదూతలు గాయత్రి మహిమను వర్ణిస్తుంటే శివశర్మ విని బ్రహ్మానంద భరితుడయినాడు. ఇంతలోనే వారియెదుట ఎంతో శోభాయమానంగా ఉన్న పట్టణం ఒకటి కన్పించింది. దాన్ని చూసిన విప్రుడు ఆ పురమేదో దాని వివరాలేమో తెలుసుకోందా మనుకున్నాడు.

శివశర్మ అభిప్రాయం తెలిసికొని దూతలు ఇలాచెప్పారు. మహాత్మా! ఇది స్వర్గలోకం. ఈ పట్టణమే అమరావతి. ఈ పట్టణంలోని మేడలను చూడు. బంగారుగోడలు, బంగారుతలుపులు, బంగారుగోపురాలు. హేమ వర్ణంతో ప్రకాశించే సూర్యుడు ఈ పట్టణసమీపమంటే భయపడుతుంటాడు. అమావాస్యరోజులలో సూర్యునిగర్భంలోకి చేరబోయే సమయంలో చంద్రుడు తనకాంతిని ఇక్కడ ఉంచివెళ్ళినాడా అన్నట్లుగా ఈ పురంలోని మేడలు బంగారువన్నెతోబాటు తెల్లగాకూడ ప్రకాశిస్తున్నాయి.

అదుగో ఎగురుతూ గంతులు వేస్తున్నదే ఆవు. అదే కామధేనువు బిడ్డ. కడుపార పాలు త్రాగి సంతోషంతో చెంగనాలు వేస్తూ ఎంత అందంగా ఉందో చూడు. ఆ తెల్లని ఏనుగే ఐరావతం. తన మెడలోని ఘంటారావం నాల్గు దిక్కులా ప్రతిధ్వనిస్తుంటే ఎంత ఠీవిగా రాజమార్గాన నడుస్తున్నదో చూడు. ఇదిగో ఈ ప్రక్క కనబడేదే నందనవనం. ఆ వనంలో పెద్దవిగా కనిపిస్తున్నవే అవి మందారం, కల్పం, సంతానం, పారిజాతం, చందనం అని పిలువబడే వృక్షాలు.

ఇక్కడి వారికి వార్ధక్యంతో పనిలేదు. సుధాకరుని కిరణాంత

చంద్రకాంత శిలలు కరగి వరసప్పుడుగా ఉంటాయి. కల్పవృక్షం వస్త్రాలు కూడ అందిస్తుంది. అందువలన అక్కడ పాలితో పనిలేదు. కోరిన కోరికలు తీర్చటానికి చింతామణి రత్నాలున్నాయి. వంటలు వాళ్ళతో పనిలేదు. కామధేనువే భోజ్యపదార్థాలు అన్నీ సమకూరుస్తుంది. అందుకే మానవు లంతా స్వర్గవైభవం, స్వర్గసౌఖ్యం అంటుంటారు. పాల సంద్రంలో లక్ష్మీదేవి వెంట వచ్చింది, మన్మథ మొలకలు అనదగిన అప్సరసలు అక్కడి భోగకాంతలు.

స్వర్గంలో శ్రేష్ఠమైన వనం నందనవనం. తరువులలో పారిజాతం విశిష్టమైనది. స్త్రీలలో ఊర్వశి అందగత్తె. అశ్వాలలో ఉచ్చైశ్శ్రవం, ఏనుగులలో ఐరావతం, రత్నాలలో చింతామణి శ్రేష్ఠమైనవి. అక్కడనే అగ్ని మొదలయిన దిక్పాలకులు, నారదుడు మొదలయిన దేవర్షులు, నహుషుడు, నలుడు, మాంధాత, ధుంధుమారుడు మొదలగు చక్రవర్తులు, వాజపేయాది యాగాలుచేసిన సోమయాజులు, తులాపురుషాది దానాలొనర్చిన వదాన్యులు, యుద్ధరంగంలో మరణ త్రివృక పోరాడిన వీరులు నివసిస్తుంటారు.

వీరిలా వివరిస్తుండగనే రథం ముందుకుసాగి అర్చిష్మతీపురానికి చేరుకుంది. దాన్ని చూసి విష్ణుదూతలు ఆ పురాన్ని గురించి చెప్పసాగారు.

మహాభాగా ! ఇది అర్చిష్మతీ అనే పేరుగల పట్టణం. అగ్నిలోకానికి రాజధాని. ఎనిమిది దిక్కులయందు ఇలాగే ఎనిమిది లోకాలు, పట్టణాలు ఉన్నాయి. సంయమనీ పురానికి పాలకుడు యమధర్మరాజు. నైరృతి దిక్కునగల పుణ్యవతీ నగరానికి పాలకుడు నిరృతి. వరుణుని పట్టణం అమరావతి. గంధవతి పాలకుడు వాయువు. ఉత్తరదిక్కున

ఉన్న అలకాపురానికి కుబేరుడు అధిపతి. ఈశాని నక్షత్రాన్ని ఈశానుడు ఏలుతుంటాడు.


అనఘీమణా! అగ్నిలోకం ప్రాధాన్యం మీవంటివారికి తెల్ప పనిలేదు. కర్మఠులయిన విప్రులకు నిశ్శ్రేయసం ఇస్తుంది. వారికి అగ్నే తీర్థం. మానవులకు గురువు, ప్రభువు, అంతరాత్మ, పరమేశ్వరుడు సమస్తం అగ్నిదేవుడే సుమా!

ఏ యజ్ఞంలోనైనా వివిధ దేవతాపురస్సరంగా వ్రేల్చబడిన ఏ పదార్థమయినా అగ్ని భక్షించిన తర్వాతనే బ్రహ్మాదిదేవతలు స్వీకరిస్తారు.

సప్తార్చి మాహాత్మ్యం విన్న శివశర్మ కింకరులతో సఖులారా! నా దొక మనవి. ఈ వైశ్వానరు డెవరు? అతని కింత మాహాత్మ్యం ఎలా కలిగింది? అని ప్రశ్నించాడు. దానికి వారిలా వివరించారు.

## వైశ్వానర చరిత్రం

పూర్వం శాండిల్యగోత్రజు డయిన విశ్వానరుడను ఈశ్వర భక్తు డుండేవాడు. అతను నియమం తప్పకుండా బ్రహ్మచర్యాశ్రమం నెరపి అనేక శాస్త్రాలు అధ్యయనం చేశాడు. విద్యార్జన పూర్తయిం తర్వాత ఒకనాడు మనస్సులో ఇలా వితర్కించుకొన్నాడు. పెద్దలు నాలుగు ఆశ్రమాలు ఏర్పరచారు. అందులో ఏ ఆశ్రమంలో జీవితం గడిపితే ఐహిక ఆముష్మిక ఫలాలు పొందవచ్చు? ఆలోచిస్తుంటే దేనికదే మంచిదిగా కనిపిస్తుంది. ఆశ్రమ ధర్మాలు నిర్వర్తించి మానవులు కృతకృత్యులౌతారు. బ్రాహ్మణులకు బృహస్పతి యజ్ఞం, క్షత్రియులకు రాజసూయం, వైశ్యులకు వైశ్యష్టోమం, వర్ణోచితకృత్యాలు. ఆశ్రమధర్మాలు అనేక విధాలుగా ఉంటాయి. అధ్యయనం మొదలయినవి బ్రాహ్మణాది

ధర్మాలు. అగ్నికార్యం తీర్చటం గృహస్థుని ధర్మం. కామక్రోధాదులకు అతీతుడుగా సంచరించటం వానప్రస్థుడు చేయతగింది. తనన్ను నిర్వర్తించుకొంటూ అరణ్యంలో నివసించటం సన్యాస్యాశ్రమ ధర్మం. వీటిలో బ్రహ్మచర్యంకంటె, గృహస్థాశ్రమం, దానికంటె వానప్రస్థం, అన్నింటికంటె యత్యాశ్రమ స్వీకారం ఉత్కృష్టములు అని పెద్దలవలన వింటాం. మానవుడు ఏ ఆ శ్ర మం లో ఉం డ యి నా తరింపవచ్చు. కాని అన్ని ఆశ్రమములకు ఆధారభూతమైన గృహస్థ ధర్మం ముక్తిసాధనమని తోస్తున్నది.



కొందరు వర్ణాశ్రమాచారములలో ఉండేవారికి బ్రహ్మనిష్ఠ సిద్ధించదు. సమస్త వ్యాపారాలను త్యజించి కేవలం పరమాత్మ తత్వాన్ని తెలుసుకొంటూ బ్రహ్మమును తెలుసుకోవటం బ్రహ్మనిష్ఠ. కర్మానుష్ఠానం, కర్మపరిత్యాగం పరస్పర విరుద్ధాలు అంటారు. అయితే కర్మానుష్ఠాన పరుడు తనకుకల్గిన అవకాశంలోనే బ్రహ్మమును గురించి తెలుసుకోవగల్గుతాడు. కనుక కర్మపరుడు పరతత్వాన్ని తెలుసుకొనలేడు అని చెప్పకూడదు. పరుల కార్యాలయందు అనాసక్తుడుగా తనకార్యయందు ఋతుకాలంలోమాత్రం భోగం అనుభవించేవారు బ్రహ్మచారియే. రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు జయించిన వారు నిజానికి వానప్రస్థులే అవుతారు. అయాచితంగా లభించిన దానితో తృప్తిపడి గృహస్థాశ్రమం నెరపేవారు అన్ని యాశ్రమాలు ఆచరించిన వారే కాగలరు. దేవయజ్ఞం, పితృయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్యయజ్ఞం, బ్రహ్మయజ్ఞం అనే పంచ మహాయజ్ఞాలు నిర్వర్తించి గృహస్థుడు ముక్తి పొందుతాడు. కనుక నేనుగూడ గృహస్థాశ్రమం స్వీకరిస్తానని నిశ్చయించుకొన్నాడు.

శుచిష్మతి అనే కన్యను శాస్త్రవిధిగా విశ్వానరుడు వివాహం చేసు

కొన్నారు. ఆమె రూపవతే కాదు. గుణవతి కూడ. యౌవనవతి అయిన శుచిస్మృతి మంచిగంధపు నీటితో స్నానంచేసి, మడుగువస్త్రం ధరించేది. కొప్పు చక్కగాపెట్టి పుష్పాలు ధరించేది. కస్తూరితిలక రేఖా మధ్యలో బొట్టు దిద్దేది. నిత్యం అగ్నిహోత్రం సిద్ధంచేసేది. దేవతానివేదనకు సమస్తపదార్థాలు సిద్ధంచేసేది. అనుకూలవతి అయిన భార్య దొరికినందుకు విశ్వానరుడు మనస్సులో ఎంతో సంతోషపడుతూ యథావిధిగా గృహస్థధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి.

ఎన్ని ఐశ్వర్యాలున్నా, సుఖాలున్నా శుచిస్మృతికి సంతానం లేక పోవటం ఎంతో లోటుగా కనిపించింది. ఎన్నో నోములు నోచింది. ఎన్ని వ్రతాలెన్నో ఎంతో భక్తిశ్రద్ధలతో ఆచరించింది. అయినా ఆ దంపతులకు బిడ్డలు కలుగలేదు. ఆ చింతాభారాన్ని భరించలేక శుచిస్మృతి ఒకనాడు భర్తతో ఇలా అంది.

స్వామీ! పట్టుపుట్టాలకు, బంగారు ఆభరణాలకు నాకు లోటులేదు. భృత్యులకు, అతిథులకు ఎంతో ఆదరంతో, శ్రద్ధతో ఆతిథ్యం ఇస్తున్నాము. నిరంతరం మీపాదసేవ చేస్తున్నాను. నిజానికి నావంటి అదృష్టవంతురాలు లేదు. కాని ఐశ్వర్యాలన్నీ ఒకఎత్తు. సంతానం ఒకఎత్తు. దేవునకు మనమీద ఎందుకు కటాక్షం తప్పింది. 'అపుత్రస్యగతిర్నాస్తి' అని పెద్దలంటారు. సంతానంలేని ఈ వైభవాలన్నీ నిష్ప్రయోజనం గదా! కనుక సంతానంకొరకే ఉపాయం ఆలోచించవలసింది. విశ్వానరుడు భార్యమాటలు విని, దేవీ! చింతించకు. అర్ధశశాంకధరుని కృపచేతనే మనకు సంతానం కలుగుతుంది. ఆ మహాదేవుని తపస్సుచేసి మెప్పించి వరాలు పొందుతాను. నీ కోరిక తీర్చగలనని అనునయించాడు. ఆ మాటలకే పుత్రులు కలిగినంతగా ఆమె

సంతోషించింది. భర్తకు నమస్కరించి నన్ను పుత్రవంతురాలునుగా దీవించి, పరమేశ్వరుని వరమడిగేటప్పుడు ఆయనవంటి కుమారుడు కావలెనని ప్రార్థించండి అన్నది. భార్యమాట అనురాగంతో విశ్వానరుడు సరేనన్నాడు.

మరుక్షణంలో ఆయన మనస్సులో అనేక భావతరంగాలు చెలరేగినాయి. ఏమిటీ వింత ! ఈమెకు ఇటువంటి కోరిక కలిగింది. పరమేశ్వరునితో సమానుడు మరొక దేవుడు ! అతడు సమానాధిక రహితుడే. అలాంటప్పుడు ఈమె కోర్కె ఎలా తీరుతుంది. ఈశ్వరునికి తెలియకే ఈమెకీ కోర్కె ఉదయిస్తుందా ! భవితవ్యం ఎలా ఉంటుందో ! అని పరిపరివిధాల తర్కించుకొన్నాడు. ఒక నిశ్చయమునా తాను పుత్రసంతాన అర్థియై నియమవ్రతం పూనినాడు.

తన అర్ధాంగికోరిక తీర్చటానికి పరమేశ్వరారాధనమే మార్గమని విశ్వానరుడు కాశీక్షేత్రానికి వెళ్ళినాడు. అక్కడగల అన్నిఘట్టాలలో సమంత్రకంగా పెక్కుమార్లు స్నానంచేశాడు. కాశీయందున్న బావులు, తటాకాలు, కాలువలు నీటియగ్గులు అన్నింటిలో మునిగాడు. వారణాసిలో వెలకొన్న విఘ్నేశుడు, భద్రకాళి, లోలార్కుడు కాలభైరవుడు మొదలైన సమస్తదేవతలకు, పూజలర్పించాడు. కాశీలోని తీర్థానగల అన్నితీర్థాలలో పిండప్రదానంచేశాడు. కనబడిన ప్రతిలింగమునకు మ్రొక్కినాడు. గూఢలింగాలను అర్చించాడు. కాశీయందుగల ఓంకారేశ్వర, కృత్తివాసేశ్వర, కాళేశ్వర, వృద్ధకాళేశ్వర, కలశేశ్వర, కేదారేశ్వర, కామేశ్వర, జ్యేష్ఠేశ్వర, దశాశ్వమేధేశ్వర, దృక్కేశ్వర, గరుడేశ్వర, గోకర్ణేశ్వర, గణేశ్వర, ఢుండీశ్వర, గణవృద్ధేశ్వర, ధర్మేశ్వర, తారకేశ్వర, చండీశ్వర, మోక్షేశ్వర, వరుణేశ్వర, వృషేశ్వర, త్రిపురేశ్వర, మార్కండేశ్వర, మణికర్ణికేశ్వర, యమునేశ్వర, లాంగలేశ్వర, శ్రీవిశ్వేశ్వర, అవిముక్తేశ్వర

# వీరేశ్వర ప్రభావం

ఆ మహా జ్యోతిర్లింగమూర్తికి వీరేశ్వరుడనే ప్రసిద్ధి కలదు. అతడే జయద్రథునికి, విదూరథునికి, మగధరాజుకు, వసుదత్తునికి కోర్కెలను తీర్చినవాడు. ఈ స్వామి వల్లనే అభిమతార్థములు పొందుతాను అని ఆలోచనచేశాడు విశ్వానరుడు. అనంతరం అతడు చంద్రకూప జలంతో అభిషేకం చేశాడు. నియమవ్రతుడయి ఒక నెల ఏకభుక్తం చేశాడు. ఒక నెల నక్షత్రదర్శనం అయినతర్వాత ఆహారం తీసుకొన్నాడు. ఒక మాసంరోజులు ప్రయత్నంలేకుండా దొరికిన ఆహారంతో గడిపాడు. ఒక నెల అసలు భోజనమే మానివేశాడు. పాలు మాత్రం సేవించేవాడు. ఒక నెల పంస్థితిని ఉన్నాడు. గుప్పెడు నువ్వులుమాత్రం తింటూ ఒక నెల కాలంగడిపాడు. ఒక నెల నీరు మాత్రమే త్రాగినాడు. ఒక నెల పంచగవ్యాలు తిన్నాడు. ఒక నెల చాంద్రాయణ వ్రతం ఆచరించాడు. దర్భచివరల ఉండే నీటిబొట్లతో ఒక నెల నియమం పాటించాడు. ఒక నెల వాయువును ఆహారంగా తీసుకొన్నాడు. ఇలా సంవత్సరం గడిచింది.

నూతన సంవత్సరంలో మొదటి దినం సూర్యోదయమైంది. అనూరుడు తీక్షణంగా వెలికివచ్చాడు. ఏడు అంచెలుగా ఉండే గుర్రాలను తన ఆజ్ఞప్రకారం నడుపుతున్నాడు. వెండి క్షేత్రానికి ఎదురుగా మయూఖం ధరించాడు. వెంబడి తరుముతూ చీకటిని వెన్నుచరిచి సాగనంపుతున్నాడు. ఒక్కొక్క కొండనే గుర్తుచూపుతూ వాటిమధ్యలో ప్రకాశిస్తున్నాడు. కర్మసాక్షి అయిన దినకరుని ప్రతిహారిగదా అతడు.

విశ్వేశ్వరస్వామి నగరిలో ప్రథమ సంధ్యాకాలం అభిషేకధ్వని వినవస్తున్నది. అవిముక్తక్షేత్రంలో విశాలాక్షిదేవి నిలువబడ్డను

ముందుంచి తిలకం ధరిస్తున్నది. కుక్కుటధ్వానములు నాలుగువైపుల నుంచి హెచ్చరికలు చేస్తున్నాయి. రేయంతా గడచి కావలికాచిన భైరవుడు ఒక ప్రక్కన కూలబడి కన్నుమూస్తున్నాడు. విఘ్నేశ్వరుడు తొండమునిండ నీరుపీల్చి ఆకసముపైపు నీటిధారలను చిమ్ముతున్నాడు.

తొలి సంధ్యాసమయంలో లోకమంతా జాగృతమయి తమతమ విధులను నిర్వర్తింపసాగింది. ముక్తిమంటపంలో ద్విజులు సావిత్రి నుపాసిస్తున్నారు. పరమహంసలు ఉపనిషద్వాక్యాలలో బ్రహ్మవస్తు మీమాంసను కోరుతున్నారు. యోగులు సోహంభావనా ఆనందానుభూతిలో స్థైర్యం వదలకుండా ఉన్నారు. ప్రత్యగ్రగోపాలకృష్ణునితో బహూదకులు దండత్రయం ధరించారు. ఒడలినిండా భస్మం అద్దుకొని పాశుపతులు ఎర్రనిజడలు ముడివేసుకొన్నారు.

ఉదయ సూర్యకాంతి ప్రభలు లోకంనిండా వ్యాపించాయి. పర్వతాంలోని ధాతువు, చెట్లయందలి చిగురాకులు, సముద్రంలోని పగడపు తీగ, మబ్బులోని మెరుపుతీవె, దిగ్గజములు ధరించిన సిందూరం, భూమి ధరించిన బంగారునగలు, బ్రహ్మాండం అనే ఇంటిలో వెలుగుతున్న దీపములా అన్నట్లు ప్రకాశిస్తున్నాయి.

సూర్యోదయ సమయంలో విశ్వనాథుడు ఆపస్తంబ సూత్రాలు పఠిస్తూ తన త్రైపాదవిహారి జన పవిత్ర గంగా ప్రవాహంలో స్నానం ఆచరించి సూర్యభగవానుడికి అర్ఘ్యప్రదానంచేసి అర్చించాడు. కోసు గుండంలోని భస్మాన్ని శరీరమంతా అలదినాడు. రుద్రాక్షమాలికలు ధరించాడు. మహా సరస్వతికి మ్రొక్కినాడు. స్కందునకు పలిగోళ్లు సమర్పించాడు. విఘ్నేశ్వరునికి ప్రణతులర్పించాడు. ఆదిత్యభవానీగ్నులను ఉపాసించాడు. పుండరీక పద్మాసనంపై తూర్పుముఖంగా పద్మా

సమస్థులై కూర్చున్నారు. నిశ్చలుడయి ప్రాణాయామం ఆచరించి చిత్తశుద్ధి పొందించుకొన్నారు. విశుద్ధవేదాంతజ్ఞానం కలవారు కావటంచేత చూడ తగినవారు, వినదగినవారు, ధ్యానింపతగినవారు, అనంత సచ్చిదానంద రూపుడు, అద్వితీయుడయి జ్యోతిర్లింగమయ స్వరూపుడయిన అవిముక్తే శ్వరుని మనస్సులో నిల్పి నిశ్చలభావంతో ఆరాధిస్తున్నారు.

విశ్వావసుని భాగ్యం పండింది. మహేశ్వరుని కాతనిపై దయ కలిగింది. ఈతని దగ్గరి కటాక్షింపదలంచాడు. వీరేశ్వరలింగం నుండి మహాతేజస్సంపన్నుడయిన ఒక బాలుని పొడసూపినాడు. ఎంత అద్భుతం! ఫాలంపై శిరోరేఖాయుతమై తేజస్సు రాజిల్లుతున్నది. అత్యంత మనోహరంగా ఆ బాలుడు మందహాసం చేస్తున్నాడు. కమనీయమైన ఆ ధ్వని దిక్కులన్నింట ప్రతిధ్వనిస్తున్నది. అతడిని చూడగానే విశ్వావసుడు ఆనందపులకితగాత్రుడైనాడు. అతని కన్నులవెంట ఆనంద బాష్పాలు కారుతున్నాయి. బయటి ప్రపంచాన్నే మరచిపోయాడు. ఫాలంమీద అంజలి ఘటించాడు. ఆ మహదానంద స్థితిలో విశ్వావసుడు మందరస్వరంలో ఏమో అంటున్నాడు. బ్రహ్మమొక్కడే సత్యం. రుద్రుడొక్కడే కర్త. సమస్త విశ్వానికి ఆధారభూతుడతడే. అద్వితీయుడవయిన నీకు నమస్కారము. నీటియందు చల్లదనం, అగ్నిలో దహనత్వం, సూర్యునియందు తాపం, చంద్రునియందు ప్రసాదత్వం, పూవులలో వాసన అంతర్లీనమై ఉన్నట్లుగా నిఖిల జీవకోటిలో అంతరాత్మ రూపాన ఉండే నీకు నమస్సులు. ఇంద్రియాలు లేకుండానే సమస్తజ్ఞానం పొందగలిగినవాడవు నీవే! కులగోత్రములు, నామరూప ములు శీలం ఏదీ తెలియరాని వాడవు నీవే! శస్త్రం అస్త్రాలు నిర్వ టించే పురుషార్థం దయించిన వాడవు నీవే! సృష్టిస్థితిలయాలచేసే

దివ్యస్వరూపం నీవే! అని అనేకవిధాల స్తోత్రంచేసి సాష్టాంగ దండ ప్రణామం చేశాడు.



పరమేశ్వరుడు అతని నిశ్చలభక్తికి, ఉపనిషద్వాక్యస్తోత్రాదికి సంతసించాడు. ముగ్ధస్వరంతో అమృతమేదురమైన పలుకులతో "బ్రాహ్మణోత్తమా! నీ మనోరథం నాకు తెలుసు. పతివ్రతా తిలకమైన నీ పత్ని శుచిష్మతియందు నీకు పుత్రుడుగా నేనే జన్మిస్తాను. కాక యింత చేసిన తపస్సు వృథా అవుతుందా! అచిరకాలంలోనే మీ దంపతుల కోర్కె ఫలిస్తుంది. నీ వింక ఇంటికేగవలసింది" ఆనతిచ్చాడు. అనంతరం ఆ బాలుడు వీరేశ్వరలింగంలోనే అంతర్హితుడైనాడు. సంతుష్ట హృదయంతో విశ్వానరుడు ఇంటికేగి భార్యతో జరిగినదంతా వివరించాడు. ఆనందంతో ఆ దంపతులు యథావిధి శివార్చన చేస్తూనే ఉన్నారు.



# చతుర్థాశ్వాసం



అనంతరం కొద్దికాలానికే శుచిష్మతి గర్భందాల్చింది. చెక్కిళ్ళు తెల్లబడినవి. చనుమొనలు నల్లనైనవి. గర్భస్థుడు కాలకంఠుడన్న విషయం తెలియపరచటానికా అన్నట్లు వారియందు నారుగారు కొన్నది. అనన్యమైన కాంతి ఆమె శరీరంలో వ్యక్తం కాజొచ్చింది. చూచినవాళ్ళంతా ఆ కాంతికి ఆశ్చర్యపడుతున్నారు. యజ్ఞయాగాదులలో హుతద్రవ్యాలను పురోడాశమును తానే ఆరగించవలెననే కోర్కె జనించేది. అవును మరి. యజ్ఞపురుషుడయిన పరమాత్మ ఆమె గర్భస్థుడు గదా! అలాటి కోరిక జనించటంలో ఆశ్చర్యం ఏముంది.

విశ్వానరుడు, బంధువులు ఆమెకు గృహ్యోక్తప్రకారం పుంసవనం సీమంతోత్సవాలు నిర్వర్తించారు. పదినెలలు నిండి ప్రసవసమయమాసన్నమైంది. గురువు కేంద్రంలో ఉండగా శుభలగ్నంలో అవిముక్త వీరేశ్వరుని దివ్యతేజోరూప విశేషంతో సమస్త శుభలక్షణాలతో శుచిష్మతికి కుమారుడు జనించాడు. ఆకసమునుంచి పుష్పవర్షం కురిసింది. దేవ దుందుభులు మ్రోగినాయి. ముల్లోకాలలోవారికి ఏదో తెలియరాని ఆనందం కలిగింది. బ్రహ్మవిష్ణులు దేవేంద్రాది దేవతలు విశ్వానరునింటికి వచ్చారు. జాతకర్మాదులు నిర్వర్తింపచేసి ఆ బాలునికి గృహపతి అనే నామకరణం చేసి దేవతలు తమతమ లోకాలకు వెళ్ళారు.

శుక్లపక్ష చంద్రునివలె ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. అయిదవయేట ఉపనయనంచేసి గురుకులానికి పంపించారు. అత్యంత శ్రద్ధాసక్తులతో గృహపతి సాంగంగా వేదాన్నికూడ అభ్యసించాడు.

కొన్నిరోజులకు అక్కడకు నారదుడువచ్చాడు. దేవర్షిరాగానే

విశ్వానరుడు భక్తితో ఎదురుగా పోయి ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యాదులొసగి అర్చించాడు. మార్గాయాసం తీరినతర్వాత నారదుడు విశ్వానరా! పతివ్రతామతల్లీ! శుచిష్మతీదేవీ! కుశలమా? కుమారుడు మీ యెడల భక్తి శ్రద్ధలు కలిగి ఉన్నాడా. తల్లిదండ్రులమాట ధిక్కరించకుండటమే తనయుల ధర్మంగదా. దైవం గురువు ధర్మం మాతాపితరులే సుమా! అందుకే తల్లి ఋణం తీర్చరానిది. నవమాసాలు మోస్తుంది. ప్రసూతిసమయంలో భరించరాని వేదనను భరిస్తుంది. పసిపాపలుగ ఉన్నపుడు ఏ అసహ్యించుకోక మలమూత్రాలు సైతం తీసి శుభ్రపరుస్తుంది. తల్లిదండ్రులు పడరాని పాట్లుపడి బిడ్డలను పోషించుకొంటారు. ఇట్టి తల్లిదండ్రుల పాదాలకు ఉదయానే నమస్కరిస్తే ఆయుష్షు పెరుగుతుందని పెద్దలంటారు. గంగా యమునా సరస్వతీ మొదలైన పుణ్యనదీ జలాలకంటె తల్లిపాదములు కడిగిన జలంమే ఎక్కువ పవిత్రమైనది. ఎల్ల దేవతలు తల్లితరువాతనే అర్చింప తగినవారు అని ప్రస్తావవశంగా నారదుడు జననీజనకుల సేవను ప్రశంసిస్తున్నాడు. గృహపతివచ్చి ఆయనకు నమస్కరించాడు. ఆ బాలుని ఎత్తి తొడపై కూర్చుండబెట్టుకొని నారదుడు అతని అవయవాలను పరిశీలించాడు. అరచేతిని పరీక్షగా చూశాడు. చూడగానే అతని ముఖం చిన్నబోయింది. నారదుని ముఖకవళికలను చూస్తున్న విశ్వానరుని మనస్సు ఎందుకో ఆందోళనకు గురయింది. దేవర్షి విశ్వానరునితో విశ్వానరా! మీ కుమారుడు సర్వశుభలక్షణాలు కలవాడు, ఇన్ని మంగళకరమైన లక్షణాలను కూర్చిన విధాత ఎక్కడనో ఒక అవలక్షణం కల్పిస్తాడు. సాముద్రిక లక్షణాలు చూస్తే ఈ బాలుడు ఒక లోకానికే అధిపతి కాదగినట్లుంది. కాని ఏం ప్రయోజనం. ఈతని అవలక్షణం చెప్పటానికి నోరురావటంలేదు. చెప్పకుండా ఉండటానికి మనస్సంగీకరించటం లేదు. కనుక యథార్థం చెప్పుతాను వినుము. మీ కుమారునికి పన్నెండవసంవత్సరాన వజ్రాయుధం

కారణంగా గండంఉంది. అనిచెప్పి నారదుడు అక్కడనుండి వెళ్లినాడు.


పిడుగుపాటువంటి ఆ వార్తవిని శుచిష్మతి విశ్వానర దంపతులు కుప్పకూలినారు. దుఃఖాతిరేకంతో క్రుంగిపోయిన తల్లిదండ్రులను చూచి వైశ్వానరుడు అమ్మా ఎందుకు దుఃఖిస్తావు. తండ్రీ ఎందుకు విచారం. మీ పాదపద్మసేవే నాకు సర్వదా రక్షణగా ఉంది. అలాంటప్పుడు మృత్యువు నావద్దకెలావస్తుంది? అహంకారంతో అది నాదగ్గరకువస్తే హుంకార మాత్రంచేతనే దూరంగా నెట్టివేయగలను. వజ్రసమానమైన నా ఎడమ పాదంతో దాని పళ్ళురాలదంతాను నేనిప్పుడే కాశీపట్టణానికి వెళ్ళి మహా కాలుడయిన విశ్వనాథుని చరణారవిందాలను శరణుకొల్చి, మృత్యువుకే నేను మృత్యువును ఔతాను అని ధీరంగా పల్కినాడు.

కుమారుని మాటలకు పాపమా దంపతులకు అంత దుఃఖంలోను సంతోషం కలిగింది. కొడుకును అక్కునచేర్చుకొని, నాయనా దీర్ఘాయుష్మంతుడవు కావలసింది. మహాదేవుడు అప్రతిమాన మాహాత్మ్యం కలవాడు కాలపాశబద్ధుడై ప్రాణంపోతున్న శ్వేతకేతుని రక్షించాడు. శిలాదుని కుమారునకు మృత్యుభయం లేకుండాచేశాడు. కంఠబిలంలో కాల కూటాన్ని అదిమిపెట్టి లోకాలు అతివిషాగ్నికి దగ్ధంకాకుండా నిలిపినాడు. అయుష్షుతీరిన మార్కండేయుని చిరాయువుగా చేశాడు. అంధక, జలంధర, గజ, వ్యాఘ్రాసురుల మదమణచినాడు. దక్షప్రజాపతి గర్వం మాపుమాపాడు. మన్మథుని బుగ్గిచేశాడు. లోకకంటకులయిన త్రిపురాసురులను తుంచాడు. వారణాసీ పురాధీశ్వరుడికి నిన్ను రక్షించటం ఒక లెక్కాగాదు పోయిరమ్మని ఆశీర్వదించి కాశీకిపోవటానికి అనుమతించారు.

వైశ్వానరుడు కాశీయందు మణికర్ణికాఘట్టంలో తీర్థమాడి విశ్వనాథుని దర్శించాడు. జ్యోతిర్లింగమయ స్వరూపుడయిన ఆ పరమేశ్వరుని స్తోత్రం

చేశాడు. స్వామీ! సమస్తమూ ఇంత వినయాధిపులను నీవే ముల్లోకాలు నీవలనే కలిగాయి. బ్రహ్మారసాయన వరార్థం నీవే లింగరూపం ధరించిన నిర్వికార నిరాకారుడవు. కైవల్యం ప్రసాదించే దైవానివి అని సాష్టాంగదండ ప్రణామాలు అర్పించాడు. ఆ పుణ్యప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకొన్నాడు. ఒక శుభముహూర్తాన తాను పరమేశ్వరుని లింగరూపాన ప్రతిష్ఠచేశాడు. దాని సమీపంలో కూర్చుని ఘోరమైనతపస్సు చేయనారంభించాడు. రెండు వత్సరాలు గడిచాయి. అనంతరం ఒకనాడు ఐరావతారూఢుడై ఇంద్రుడు ప్రత్యక్షమయినాడు. వజ్రాయుధం చేతిలో మెరుస్తున్నది. మహేంద్రుడా రాజునితో నీ తపస్సుకు సంతసించాను. నేను దేవేంద్రుడను, ఏం వరం కావాలో కోరుకొమ్మన్నాడు. వైశ్యవరుడు అతనికి నమస్కరించి అల పూరదా! నిన్ను నేను వరంకోరను, నాకధిపతియైన కాళేశ్వరునే వరమిమ్మని ప్రార్థిస్తాను అన్నాడు. దానితో ఇంద్రుడు అహంకరించి ఏమిటీ! కాళేశ్వరుడని ఒక దైవం ఉన్నాడా? ముల్లోకాలను పాలించేది నేనుకానా? నను త్రివిక్రమునికి నేనే అధిపతిని, నాకంటె వరాలిచ్చేవారు మరొకరు లేరు అన్నాడు.

అతని మాటలను వైశ్యవరుడు కంటగించుకొన్నాడు. సౌశ్యక్షతో కాలు తూర్పరవిందను అతడు సహించుకొనలేక పోయినాడు, మహేంద్రా ఎంతటి గర్వోక్తులు. నీ మాటలు నన్ను మోహించటానికి కావుగదా! మహేశ్వరుని శూలపాణినీ! నీ శక్తి అహంకారుని శక్తి లోకానికే తెలుసు. నీ అధికారం ఆధిపత్యం తెలియని వారముకాము. నిన్ను యాచించటం కల్పవృక్షాన్ని వదలి గడ్డిపరకను ప్రార్థించటం వంటిది. నీవంటివాళ్ళు మాకోర్కెల్ని కోరితే తీర్చటానికి సమర్థులు కారు. చంద్ర మౌళీశ్వరుడే నాకు దేవుడు. నీ వ్యక్తత్వంగాలతో నా తపస్సుకు భంగం

కలిగించక వెళ్ళవో అని పరుషంగా పలికాడు. దానితో ఆ అహల్యాజారుడు క్రోధాంధుడై విరోధిదళనదక్షమైన వజ్రాయుధాన్ని ఝళిపించాడు. కనుల మిరుమిట్లుగొలిపే కాంతులు, కొండలు బద్దలవుతున్న భయంకర ధ్వనులు, భూనభోంతరాళాలు నిండాయి. దిక్కులు పిక్కటిల్లే ధ్వనులకు వైశ్వానరుని గుండె దడదడమని కొట్టుకోసాగింది. మనస్సు కంఠే కాలునిపై నిలిపి ధ్యానంచేస్తూ మూర్ఛపొందినాడు. ఆ సమయంలో దంభోళిధారాధ్వానాన్ని మించిన మహాధ్వని మహాకాశి వినిపించింది. కోటి సూర్యప్రభలతో కాంతిపుంజం వెలువడి మరుక్షణంలో ఆకృతి ధరించింది. జటాజూటంపై చంద్రరేఖ. కంఠమూలంలో కాలకూటచ్ఛాయ, పడగవిప్పి బుసలుకొడుతున్న నాగరాజు, శరీరమంతా అలదినభసిత ధవళకాంతులు వెదజల్లుతూ విషమేక్షణుడు సాక్షాత్కరించాడు. ప్రళయకాలుని చూడగానే దేవేంద్రుడు కంపితగాత్రుడయి ముకుళితహస్తాలతో పాహి పాహి అని నమస్కరించి తనతప్పును క్షమించమన్నాడు. పరమ కృపాళువు భోళా శంకరుడయిన ఈశుడు ఆతనిని క్షమించాడు. అమృతహస్తాలతో వైశ్వానరుని లేవదీసినాడు. త్రైలోక్యసుందరుని కరస్పర్శతో ఆ బాలుడు పూర్వతేజస్సును సత్వాన్ని పొందాడు. మహేశ్వరుడు ఆతనినిచూచి వైశ్వానరా! నీవు నా అంశతో జనించిన పావనుడవు. భక్తితో నన్ను జయించావు. నీ వాంఛితం నాకు తెలుసు. నీవు పూర్ణాయుష్కుడవే గాదు దీప్తిమంతుడవై అగ్నిలోకానికి అధిపతివై నిలవిల్లు. ఆగ్నేయదిగాధిపత్యం నీకు ఒసగుతున్నానని చెప్పి అంతర్హితు డయినాడు. పరమేశ్వర కృపకు పాత్రుడయిన వైశ్వానరునిచూచి, ఇంద్రుడు పూర్వపు వైరంమాని సఖ్యంచేసుకొని అమరావతి కేగినాడు.

ఈ విధంగా దూతలు అగ్నిలోక వృత్తాంతం వివరించారు. ఇంతలోనే రథం మహర్లోకానికి దగ్గరగా వచ్చింది. అగ్నిలోక వృత్తాంతం

విని ఆశ్చర్యచకితులైన శౌనకాది మునులు సూతుడితో మహాపురుషులారా! మాకు అన్నిలోకాలు చూసి అక్కడి వృత్తాంతాలు వివులంగా చెప్పవలసిందని ప్రార్థించారు. సూతుడు సంతసించి ఇలా చెప్పసాగాడు.

# నిర్ఋతిలోక వృత్తాంతం

మహాభాగా! అంతకుమునుపు యమలోకాన్ని చూశారుగదా! సంయమనీపురానికి అవతల మహా లోకం ఉంది. దానిలో జాతి మాత్రంచేత రాక్షసులయినవారు కొందరున్నారు. వారంతా వేదమార్గాన్ని అనుసరిస్తారు. నిత్యం తీర్థాలలో మంత్రపూర్వకంగా స్నానంచేసి దేవ పూజలయందు మిక్కిలి ఆసక్తి కలిగి ఉంటారు. దానశీలురు. దయా పరులు సత్యాహింసలు వ్రతంగా కలవారు. దానిని నిర్ఋతిలోకం అంటారు. ఒక్క కాశీలోతప్ప తక్కిన క్షేత్రాంలో మరణించినవారు అక్కడకు చేరుతారు. ఈ లోకానికి నిర్ఋతి అధిపతి.

వింధ్య పర్వతశ్రేణులమధ్య ఒక పల్లె ఉండేది. దానిప్రక్కనున్న పల్లెను పింగాక్షుడనే కిరాతుడు పాలిస్తుండేవాడు. అతడు క్రూరకర్మములపై అనాసక్తి గలవాడు. సింహాలు పులులు మొదలయిన క్రూరమృగాలను తప్ప ఇతర జంతువులను చంపేవాడుకాదు. క్రూర జంతువులనుకూడ నీరు త్రాగేటప్పుడు, నిద్రించేటప్పుడు, రోగంతో ఉన్నవాటిని, అంగవైకల్యం ఉన్నవాటిని చంపేవాడుకాదు. ఆ అరణ్యమార్గంలో వెళ్ళేయాత్రికులను ఎంతగానో ఆదరించేవాడు. పండ్లు, దుంపలు ఇతర పదార్థాలు సమర్పించి తృప్తిపరచేవాడు. పాదరక్షలు, గొడుగులు వస్త్రాలు మొదలయినవి ఇచ్చి సంతోషపరచేవాడు. మార్గమధ్యంలో రోగగ్రస్తు లయితే వారికుపచారాలు చేయించేవాడు. అడవిలో దొంగలవల్ల వారికి

బాధలురాకుండా కాపాడుతుండేవారు. యాత్రికులు అతని సపర్యలకు ఆనందించి, అతనిని దీవించివెళ్ళేవారు.

పింగాక్షుడికి పినతండ్రి యొకడున్నాడు. వాడు మహాక్రూరుడు. పింగాక్షుడు లేనిసమయంచూచి బాటసారులను పీడించేవాడు. దోచుకొనేవాడు, ఒకరోజున అతడు తనపరివారంతో తీర్థయాత్రకేగుతున్న ఒక గుంపుపై బడినాడు. దొరికినవారిని బాదమోది దోచుకొంటున్నారు. పాపం తీర్థికులు చెప్పుకోలేక పుణ్యకోలుగా పరుగెత్తినారు. ఆర్తనాదాలు చేస్తున్నారు. దైవవశాత్తు పింగాక్షుడు అపరిచితప్రాంతానికి రావటం తటస్థించింది యాత్రికుల దీనాలాపాలు అతనికి వినిపించాయి. వెంటనే అతడు ఎలుగెత్తి ఈ ప్రాంతాన్ని పాలించే పింగాక్షుడను నేనిదేవస్తున్నాను మీకేమీ భయం లేదు, అని అరుస్తూ ఆప్రాంతానికి పరుగెత్తినాడు. లేళ్ళగుంపుపైకి దుమికే సింహంలాగా గర్జిస్తూ నానావిధములయిన ఆయుధాలతో ఆ దొంగలను మర్దించాడు. తన్నుకులుపోతూ చేతనయినంతవరకు ఆయుధాలు రాళ్ళు పింగాక్షునిపై విసిరారు, శక్తిచాలకచివరకు పారిపోయారు. అతని పిన తండ్రికూడా కనుమరుగయినాడు. దోపిడీదొంగలు పోయినతరువాత పాంథ వాహనాలు మరల గుంపుగచేరి ప్రయాణం సాగించారు.

కాని పింగాక్షుడి శరీరమంతా గాయాలు తగిలాయి. శరీరం అంతా రక్తమయం. ఒళ్ళు ఎక్కడచూచినా సందులేకుండా చిల్లులుపడినాయి. చివరకతడు మరణించాడు. పరోపకారపరాయణుడయిన పింగాక్షుడు తరువాతిజన్మలో దిక్పతియై నైరృతి దిగాధిపత్యం పొందినాడు.

పుణ్యమూర్తీ! నైరృతిలోకానికి ఉత్తరంగా వరుణలోకముంది. అదిగో అదే వరుణలోకం. ఆలోకంలో బావులు చెరువులు త్రవ్వించిన వారు, మధ్యేమార్గంలో బాటసారుల శ్రమను పోగొట్టటానికి చల్లని నీరు

మహా పురుషుడు అక్కడికివచ్చి సముద్రా! ఇతడు పరమశివభక్తుడయిన కర్దమప్రజాపతి తనయుడు. ఎందుల కితనిని ఇక్కడికి రప్పించావు. పిల్లవాని ప్రభావం తెలియదా నీకు? అని కఠినంగా ప్రశ్నించారు. సముద్రుడు ఆ శివకింకరుని చూచి భయకంపితుడయినాడు. సముద్రుడు మొసలిని పాశంతో బంధించాడు. శుచిష్మంతునికి రత్నాలిచ్చి గౌరవించాడు. కింకరుని వెంట ఆ బాలుని పంపించాడు. ప్రమథుడు బాలుని తీసుకొని కర్దమప్రజాపతియొద్దకు వచ్చినాడు. ఇదంతా కర్దమునకు గోచరిస్తూనేవుంది. కన్నులుతెరచి చూడగానే కుమారుడు, శివకింకరుడు కనిపించారు. కింకరుడు కర్దమునివద్ద సెలవు గైకొని వెళ్ళినాడు. పుత్రుని శరీరంమీద మొసలికోరల గుర్తులు కనిపిస్తున్నాయి. కళ్ళెర్రబడి ఉన్నాయి. తలవెంట్రుకల చివరం నీటి బిందువులు ముత్యాలవలె ప్రకాశిస్తున్నాయి. దీర్ఘప్రయాణంచేసిన అలసటతో నిట్టూర్పులు విడుస్తున్నాడు. శుచిష్మంతుడు తండ్రికి నమస్కరించాడు. బ్రతికివచ్చిన పుత్రుని కర్దముడు ఆనందాతిరేకంతో ఆలింగనమొనర్చుకొన్నాడు.

శివశర్మాదులారా! మహానుభావా! కర్దమునివంటి నిష్ఠాగరిష్ఠుని చూడం. ఇలాంటి చోద్యం ఎక్కడా వినం. కర్దముని కుమారుని మొసలి తీసుకువెళ్ళినది గదా! తిరిగి వచ్చేటప్పటికి నూటఅయిదు వత్సరాలు గడిచాయి. అంతకాలం అతడు సమాధిలో నిమగ్నుడయినాడు. అంతకాలం అతడు మహారాత్రికాలంవలె గడిపాడు. అనంతరం శుచిష్మంతుడు తండ్రి అనుమతి తీసుకొని కాశీ పట్టణానికి చేరాడు. అక్కడ గల పుణ్యతీర్థాలలో స్నానంచేసి శివలింగ ప్రతిష్ఠచేసి అర్చించాడు. అతని తపోదీక్షకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమయినాడు. వరుణపదం అతనికి

భోగమోక్షములు కలిగిస్తూ ఉత్తమంగ కల్పద్రుమమై విరాజిల్లుతున్నది.



పిమ్మట ఆ రథం అలకాపట్టణ ప్రాంతానికి వచ్చింది. విష్ణుదూతలు ఆలోకాన్నిచూపి మహాత్మా! ఇది ఉత్తరదిశలో ఉన్నలోకం. దీనికధిపతి కుబేరుడు. ఈలోకానికి ముఖ్యపట్టణం అలకాపురి. ఇతని వృత్తాంతం అత్యంత ఆశ్చర్యకరమైనది వినండి.

## కుబేరుని వృత్తాంతం

కాంపిల్యపురంలో యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడున్నాడు. అతడు వేదవేదాంగ పారంగతుడు. గుణవతియైన ఒక వనితను వివాహమాడి గార్హస్థ్యధర్మాన్ని చక్కగా నిర్వర్తిస్తున్నాడు. అతిథి అభ్యాగతులను ఆదరించేవాడు. యజ్ఞంచేసి సోమయాజియైనాడు, సమస్తసంపదలున్నా యజ్ఞదత్తునికి సంతానంలేదు. ఆ దంపతులు ఆచరించని వ్రతంలేదు. మునుగని తీర్థంలేదు. దర్శించనిక్షేత్రంలేదు. చేయనిదానంలేదు.

కొన్నాళ్ళకాదంపతులు కాశీకేగి విశ్వేశ్వరుని ఆరాధించారు. విశ్వనాధుని కృపవలన వారికి ఒకపుత్రుడు జనించాడు. తండ్రిఅతనికి గుణనిధి అని నామకరణంచేశాడు. పంచవర్షప్రాయుడు కాగావేదమునేర్పినారు. ఏమి కర్మమోకాని గుణనిధికి విద్యపై ఆసక్తిలేదు. కాలక్రమమున పెరిగినాడు. గుణనిధికి వయసువచ్చింది. దానితోపాటు చెడు సహవాసములవల్ల దుర్గుణాలకు ఆలవాలమైనాడు, జూదమున కలవడినాడు. గురువు వద్దకుపోక ద్యూతగృహములలో నడిరేయివరకు క్రీడలుసల్పేవాడు.

అంతేకాక బ్రాహ్మణాచారములను పరిహసించేవాడు. సంధ్యావందనం మరచి దాంభికుడైనాడు. విభూతి, గాయత్రి, శిఖ, శివముద్రలతో కాలంగడపేవాడు. జూదగాండ్రను సత్కరించి నానావిధములైన ఉద్యాన

రాదటం అతనికి ఆనందం. కులాచారాలను మిక్కిలిగా గౌరవించేవాడు. తండ్రి ఎంతటి ఆ చా ర వం తు డో కుమారుడంతటి దురాచారుడు. విశృంఖలంగా తిరుగుతున్న పుత్రుణ్ణిచూసి తల్లి హృదయం క్షోభించేది. అతనిని కఠినంగా మందలించటానికి నోరురాదు. కావటం కన్న సంతానం కదా! మంచిమాటలతో సన్మార్గంలోకి త్రిప్పాలని ఆతల్లి ఆరాటం. యజ్ఞ దత్తునికి నిత్యాగ్నిహోత్రవిధి నిర్వహణతోపాటు రాజపురోహిత్యం. వీటితో సమయం చిక్కని సోమయాజి గుణనిధిని పరామర్శించటానికి వీలుపడేది కాదు. ఎప్పుడయినా కొంచెం అవకాశం లభిస్తే భార్యను అడిగేవాడు.

గుణనిధి కనబడ లేదు !
ఇప్పటివరకు ఇక్కడే ఉండి వెడలినాడు.
స్నానం చేసినాడా ! సంధ్యాకృత్యం తీర్చినాడా !
స్నానంచేసి ఇప్పుడే సంధ్యాకృత్యం నిర్వర్తించి వెళ్ళినాడు !
అగ్నిహోత్ర విధిని నిర్వర్తించాడా !
అగ్నిహోత్ర విధి నిర్వర్తించి స్వాధ్యాయ మొనరించాడు ఇప్పటి వరకు.

సోమయాజికి యథార్థం తెలిస్తే కోపగిస్తాడని సోమిదమ్మ కుమారుని గురించి ఎన్నో అబద్ధాలు చెబుతూ కొడుకు తప్పులను కప్పి పుచ్చుతుండేది. తల్లుల ప్రేమ అంతే. చూపరాని సమయాన ప్రేమ గారాబం చూపించి తమ బిడ్డలను తామే పాడుచేసుకొనే యిల్లాండ్రు ఎందరో లోకంలో ఉన్నారు. దీక్షితాయని కూడ ఆ కోవకు చెందిందే. కొడుకు దుండగాలు ఆమె కడుపులోనే దాచుకొన్నది. పదహారు వత్స రాలు రాగానే గుణనిధికి వివాహం చేశారు. భార్య కాపురమునకు వచ్చినా గుణనిధి చెడుసహవాసము మాన్పుకోలేదు. రాత్రింబవళ్ళు జూదం

చులకనగ చూస్తారు. నా మాటవిని ఈ కొరగాని పనులు మానుకొన వలసింది.



తల్లిమాటలు విన్న గుణనిధి ఏమీ బదులు పలుకక ఊరుకొన్నాడు. వేట, త్రాగుడు, దొంగతనం, జూదం, పరస్త్రీగమనం అనేవ్యసనాలు. వీటికి యౌవనంలో మానవుడు చిక్కినాడా వానిని సన్మార్గంలోకి త్రిప్పటానికి బ్రహ్మవశంకూడా కాదు. గుణనిధి స్థితి అట్లే అయింది. తల్లి వద్ద మాట్లాడక ఊరుకొన్నాడుగాని, తన దుష్టచేష్టలు మానలేదు. యథేచ్ఛగా విహరిస్తూనే ఉన్నాడు.

ఒకనాడు యజ్ఞదత్తుడు పట్టణంలో ఒక వీధివెంటపోతూ ఒక జూదరిచేతిలో తన రత్నాంగుళీయకం చూశాడు. అది ఒక అపూర్వ రత్నం కలిగిన ఉంగరం. పూర్వ మొక వర్తకుడు ఆ రత్నపు ఉంగరాన్ని ప్రభువుకు కానుకగా ఇచ్చాడు. సోమయాజిపై గల గౌరవభావం కారణంగా రాజు ఒక పర్వదినాన ఆయనకు కానుకగా దానంచేశాడు. యజ్ఞదత్తుడి భార్య దానిపై మక్కువ చూపగా అతడు భార్యకు కానుకగా ఇచ్చాడు. ఆ ఉంగరానికి అంత కథ ఉంది. అలాటిది కావటంచేతనే ఉంగరం ఒక జూదరి చేతిలో చూడగానే సోమయాజి అది తనదిగా గుర్తించాడు. తత్కాలం విభ్రాంతుడయినాడు. వెంటనే జూదరిని పిలిచి నీకీ ఉంగరం ఎక్కడినుండి వచ్చింది? అబద్ధం చెప్పితివా నిన్నిప్పుడే రాజువద్దకు తీసుకొనిపోయి దండింపజేస్తాను అని గద్దించాడు.

సోమయాజి కోపంచూచి జూదరి భయపడి నిజంచెప్పక తప్పలేదు. స్వామీ ! మీ యాన ! యథార్థాన్ని వివరిస్తాను. మీ కుమారుడయిన గుణనిధి జూదంలో ఓడిపోయిన ధనంక్రింద ఈ అంగుళీయకం నాకు ఇచ్చాడు. ఇదొక్కటే గాదు ! మీ ఇంటిలో ఉన్న వెండి, బంగారు

ఆభరణాలన్నీ తాకట్టుపడ్డాయి. కొన్ని అమ్ముడు పోయినాయి. చివరకు రాగి, ఇత్తడి పాత్రలుకూడ అంగడికి చేరాయి. నైష్ఠికులలో ఈ యంతటి నైష్ఠికుడు లేడు. జూదరులలో ఈ కొడుకువంటి జూదగాడు లేడు అని చెప్పారు.

ఆ మాటలు వినగానే యజ్ఞదత్తుడికి భరింపరాని కోపం వచ్చింది. అవమానం కలిగింది. ధనం పోవటంకంటె తన వంశం అపకీర్తిపాలు గావటం, తన పదుగురిలో చులకనయి, నవ్వులపాలు కావటం అతని కెంతో ఆవేదన కలిగించింది. ఆవేశంతో ఎకాయెకిన గృహానికి వచ్చాడు. కర్కశ స్వరంతో భార్యను కేకవేశాడు. సోమిదమ్మా! యేమి చేస్తున్నావు? ఒకసారి ఇటురా! ఒకానొక రోజు అభ్యంజన స్నానం చేసే టప్పుడు నా ఒడలికి నలుగుపెట్టి ఒక సయ్యాటం కల్పించి రత్నాంగుళీయకం తీసుకొన్నావు. జ్ఞాపకముందా? ఆ ఉంగరం నా కిప్పుడు కావలె. దానిని ధరింపకుండా నే నీవేళ అగ్నికి హవిర్దానం చేయను సుమా! అన్నాడు.

దీక్షితాయని ఏదో కీడు శంకించింది. ముందుకోపం చల్లార్చి వివాదంగా నిజం చెప్పవద్దా మనుకొన్నది. మధ్యాహ్న సమయం అతిక్రమిస్తున్నది. స్నానం చేసివచ్చి త్వరగా అగ్నికార్యం తీర్చండి. ఈనాడు ఎందరో అతిథులు వచ్చిఉన్నారు. అంగుళీయకం భద్రంగా దాచి ఉంచాను. బరిణలో ఉంచి పెట్టెలో దాచాను. మరిచి ఉన్నాను. ఇప్పుడు పెట్టె వెదకి తీయటానికి తగిన సమయం కాదు. భోజనానంతరం తెచ్చిఇస్తాను. అని భర్త ఆవేశం తగ్గించాలని ప్రయత్నిస్తూ అన్నది.

ఆమె మాటలకు యజ్ఞదత్తుడు మరింత భగ్గుమన్నాడు. భార్య పలికిన అసత్యాలకు అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది.

వణుకుతున్న పెదవులతో సోమయాజి గారాను అన్యంగా వక్క మూతే వస్తూ ఉన్నావు! మహాపాతకివి! పత్నీవ్రతునికి తల్లివిగదా, నీ కొడుకు ఎన్నడయినా దేవకాలంలో నిద్ర లేచాడా! ఎప్పుడయినా సంధ్యవార్చినాడా? ఏనాడయినా అగ్నికార్యం తీర్చాడా? స్వాధ్యాయం చేశాడా? నే నడిగినప్పుడు యథార్థాన్ని చెప్పక దాచి అబద్ధాలు చెప్పటం ఏమి అవసరం ఏమొచ్చింది నీకు? నీవు చెప్పిన కల్లలన్నీ నమ్మి కొడుకు చక్కదిద్దుకోక ఉపేక్షచేశాను. దానితో వాడు భ్రష్టుడయినాడు.

ఎంతపెద్ద సంస్థగయినా అయపను తీయక దాచిన మంచి ఎటులోయుండో గదా! బంగారు సగలన్నీ తాకట్టుకు పోయినవిగదా. ఎక్కడి నీ ఒడ్డాణం? ఏ తులుకుటారి నడుమున బిగుసుకున్నదో గదా? చంద్రకాంత మణులతో నిర్మితమైన సాంబంతికకు కాళ్ళువచ్చి పోయినట్లుంది. రత్నఖచితమైన హంసతూలికా తల్పం ఏ ఇంటికి చేరిందో? నీవు నీ పుత్రుడు ఇద్దరుకలసి నా యిల్లు గుల్లచేసినా నాశనం చేశారు. ఇప్పటికయింది చాలు. నా కసలు కీర్తే అనేది లేదనుకొంటాను. వాడు బ్రతికున్నా చచ్చిన వాడిక్రింద లెక్క. వాడి కిప్పుడే తిలోదకాలిస్తాను. దుర్మార్గుడయిన కుమారుడుండేకంటే అసలు పుట్టక లేకుండా ఉండటమే మేలు. కులపాంసనుడయిన వానిని పరిత్యజించి కులాన్ని రక్షించుకోవలెనని పెద్దలంటారు అని కోపావేశంతో కొడుకును నిందించాడు సోమయాజి. ఆ నాటికి చేయవలసిన నిత్యనైమిత్తిక కార్యాలు తీర్చుకొన్నాడు. అనంతరం కొన్నాళ్ళకు ఒక శ్రోత్రియుని కుమార్తెను మరల వివాహం చేసుకొని యజ్ఞదత్తుడు గృహస్థ ధర్మం నిర్వర్తించాడు.

అనాడు గుణనిధి ఇంటికివచ్చే సమయానికి తండ్రి తల్లిని నిందించటం జరుగుతున్నది. లోపలకు రాకుండానే గుణనిధి తండ్రి చిక్కాడి

పరుషంగా మాట్లాడటం విన్నాడు. ఆ తరుణంలో తండ్రి ఎదుటకు పోవటానికి భయపడినాడు. వాకిటనుంచే వెనుకకు మరలివెళ్ళాడు. ఎక్కడకు పోవలెనన్నది గుణనిధికి పెద్ద సమస్య అయింది. చేతిలో ధనమూలేదు. యాచన చేదామా అంటే ఇప్పటివరకు ఒకరి కివ్వనే గాని దేహి అని ఎవ్వరిని అడుగలేదు. కిరాటకం ఎలా చేయగలను. విద్యను ప్రదర్శించి బ్రతుకుదామంటే శాస్త్రపరిచయం హుళక్కేగదా నాకు. అయ్యయ్యో నేనేం చెయ్యగలను ? చదువుకో తగిన వయస్సులో చదువు కొనక పోవటం వల్లనే గదా నా గతి ఇట్లాయింది. నిజంగా విద్యను మించిన ధనం ప్రపంచములోనే లేదు ఏ విధంగా వ్యయించినా తరుగదోయు. దొంగలపాలు కాదు. విశిష్టమైన సోమయాజి వంశంలో జన్మించిన నాకు నను నికృష్టమైన ఈ జూదపు వ్యసనం ఎందుకు పట్టు బడింది. ఇదంతా పూర్వజన్మలో నేను చేసిన పాపం. చేసినదానిని అనుభవించకుండా తప్పుతుందా! సూర్యోదయం అవుతుందో లేదో! అది గిందే తరువాయి. గిన్నెలలో వంటకాలు పెరుగు, ఊరగాయంతో సహా ఎంతో ప్రీతితో నా తల్లి భోజనంపెట్టి సాగనంపేది. ఇప్పుడెవరు నన్ను ఆదరంతో చూస్తారు. ఆదరం లేకుండె మానె. ఛీత్కారంతో ఆయన ఇంత ముద్ద పడవేస్తారా అని వితర్కించుకొంటూ గమ్యంలేని ప్రయాణం సాగించాడు. ఆ విధంగా ఎంత దూరం నడిచాడో తెలియదు.

ఇంతలో సూర్యుడు పడమటి కొండదాటుకు పోసాగాడు. క్రమ క్రమంగా చీకటి అలుముకోసాగింది. కన్నుపొడుచుకొన్నా కనుపించటం లేదు. గుణనిధికి ఆకటిచిచ్చు రేగింది. నీరసం ఎక్కువయింది. నడవ లేక ఎట్లాగో కాళ్ళీడ్చుకొంటూ పోతున్నాడు. అతని అదృష్టంకొద్దీ కొద్దిదూరంలోనే ఒక శివాలయం కన్పించింది. ఆత్రంగా [illegible]

పావనంగా దీపాలు వెలుగుతున్నాయి. గుణనిధి తిన్నగా శరీరాన్ని అక్కడకు చేరవేశాడు.



ఆ రోజు శివరాత్రి. మహేశ్వర భక్తులు కొంద రక్కడ చేరారు. వారంతా ఆనాడు శివరాత్రికి ఉపవాసం ఉన్నారు. నక్షత్ర దర్శనం కాగానే మహేశ్వరునకు మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేస్తున్నారు. ప్రక్కన నానావిధములయిన ఆహారపదార్థా లున్నాయి. అవన్నీ పరమేశ్వరునకు నివేదనకు చేయడానికి తెచ్చినవి. ఆ పదార్థముల నుండి కమ్మని వాసనలు గుబాళిస్తున్నాయి. ఆ వాసన ఆఘ్రాణించిన మాత్రాన గుణనిధికి ప్రాణాలు లేచివచ్చాయి. అవన్నీ తనకెలా లభ్యం అవుతయ్యా అని ఆలోచించసాగింటూ ద్వారంవద్దనే కూర్చున్నాడు. శివాభిషేకం రెప్పవేయక చూస్తున్నాడు.

పరమేశ్వర భక్తులు అభిషేకానంతరం నృత్యగీత వాద్యాలతో బాగా ప్రొద్దుపోయే వరకు స్వామిని సేవించారు. మూడవజాము వరకు జాగరణ చేశారు. ఏమైతే పాపం వాళ్ళు నిద్రాదేవికి లొంగి పోయారు. ఒక్కొక్కరే ప్రక్కకు వాలుతున్నారు. క్రమక్రమంగా అందరూ నిదురించారు.

కార్చిచ్చువంటి ఆకలితో బాధపడుతున్న గుణనిధికి మాత్రం నిద్ర రాలేదు. వీరంతా ఎప్పుడు నిద్రిస్తారా ఎప్పుడు ఆహారాన్నెపుడు దొంగ తనంగానైనా తినగలుగుతానా అని కంటిలో వత్తులేసుకొని చూచుకొని ఉన్నాడు. ఎక్కడి వారక్కడ నిద్రాదేవి మహిమతో ఒడలు తెలియకుండా పడగానే ఇదే మంచిసమయం అనుకొన్నాడు. తిన్నగా లేచాడు. పాదాలవరకు వ్రేలాడుతున్న దోవతిని పైకిలాగి కట్టినాడు. ఉపవాసిగా చేసివున్న శబ్దమవకుండా శరీరాన్ని లోపలకు జారవేశాడు. తలవి

బిగియబట్టి మునివ్రేళ్ళపైన చప్పుడుగాకుండా అడుగులో అడుగువేసు కొంటూ గర్భాలయందాకా వెళ్ళాడు. అక్కడున్న వత్తి కొండెక్కుతున్నది. గుణనిధి తన ఉత్తరీయంలో చివర ఒక పేలిక చించాడు. దానిని నేతిలో తడిపి వెలిగించాడు. ఆ వెలుగులో భక్తులుచేసిన అలంకారంతో మెరిసిపోతున్న లింగమూర్తిని చూడాడు. కళ్ళు ఆహార పదార్థాలమీదకు మళ్ళినాయి. అవి చూడగానే ఆతనికి నోరూరింది. ఒక పక్వాన్న పాత్రను అందుకొన్నాడు. అక్కడ తింటే ఇంకేమయినా ఉందా! ఎవరయినా నిద్రలేచి చూస్తే ప్రమాదం అనుకొన్నాడు. పాత్రతో శబ్దంచేయకుండా బయటకి నడుస్తున్నాడు. దురదృష్టవశాత్తూ అతని కాలివ్రేళ్ళు అక్కడ నిద్రిస్తున్న ఒకని శరీరానికి తగిలాయి. వాడు ఉత్తరపాటుతో లేచి దొంగ! దొంగ! యని కేకలు పెట్టినాడు. ఆ కేకలకు అందరూ లేచారు. దొంగను చూడకుండానే వాళ్ళుకూడ దొంగ దొంగ అని అరిచారు,

గుణనిధికి గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. భయంతో పరిగెత్తుతున్నాడు. అన్నపాత్రను మాత్రం వదలలేదు. నిద్రలేచిన భక్తజనం పెద్దగా దొంగ! దొంగ! అని కేకలువేస్తున్నారు. కొందరు వెంటబడినారు. గుణనిధి పిక్కబలం చూపుతున్నాడు.

భక్తుల అరుపులకు తలారులు వచ్చారు. పరుగెత్తి పోతున్న గుణనిధిని చూచి దొంగ తస్కరుడే అనుకొన్నారు. బాణాలు ప్రయోగించారు. అవి గ్రుచ్చుకొని అతడు ముందుకుపడినాడు. పడినదే తడవు మరణించాడు.

గుణనిధిని కొనిపోవటానికి యమకింకరులువచ్చారు. మరుక్షణంలో ఈశ్వర సేవకులుకూడ వచ్చారు. గణాధీశ్వరులను చూడగానే యమ

శిక్షించారు. కాలంమూడి చనిపోయినా పరమేశ్వరుని నగరి మోపాల ప్రాణాలు విడిచాడు. సూక్ష్మదృష్టితో విచారించి చూస్తే అంతకంటె కైవల్యప్రాప్తికి కావలసిన దేముంటుంది. అది శివకింకరాధ్యక్షి దన గానే ధర్ముని సేవకులు నిరుత్తరులయినారు. గణాధీశ్వరులను నమస్కరించి తమ లోకానికి వెళ్ళినారు.

శివకింకరులు గుణనిధిని విమానంపై అధిరోహింపజేసి తీసుకొని పోయి పరమేశ్వరుని ఎదుట నిలిపారు. ఈశ్వరు డతనిని సాదరంగా వీక్షించాడు. అతడు చేసిన ఆ పుణ్యకార్యములకు తగినఫలితం ప్రసాదించాడు. కైలాసంలో కొంతకాలం వసించి గుణనిధి మరుజన్మలో కళింగదేశాధిపతియైన అరిందమునికి కుమారుడుగ జన్మించాడు. ఈ జన్మలో అతని పేరు దముడు.

దముడు తండ్రి అనంతరం కళింగదేశానికి ప్రభువు అయినాడు పూర్వజన్మ స్మృతి గలవాడు కావడంచేత దీపమాహాత్మ్యం వల్ల తన కింతటి స్థితి కలిగిందని భావించాడు. తాను అన్ని శివాలయములలోను శతసహస్ర దీపకళికలను నిలిపినాడు. తన రాజ్యంలోని ప్రజలందరిని పుణ్యవంతులుగా చేయాలని సంకల్పించాడు. అందరు శివాగారంలో దీపారాధన చేయవలసిందని. దీపాలు నిల్పని వాళ్ళకు శిరచ్ఛేదనం చేయబడుతుందని శాసించి చాటించాడు. రాజదండన భయంతో కళింగదేశ ప్రజలు శంభుని ఆలయంలో దీపములు నిల్పి తమ పాపాలు నశింపచేసుకొన్నారు.

చాలకాలం రాజ్యం పాలించిన అనంతరం దముడు కుమారునకు పట్టాభిషేకం చేసి తాను అరణ్యానికి వెళ్ళాడు. శివయోగ్యుడుగా జీవించాడు. కొన్నాళ్ళకు మరణించాడు. తరువాత జన్మలో విశ్రవసు

తన పుత్రుడుగా జనించాడు. బ్రహ్మమానస పుత్రుడు పులస్త్యుడు. పులస్త్యుని కుమారుడు విశ్రవసుడు. మహా తపశ్శాలియైన విశ్రవసునకు మరియొక భార్యయందు రావణ, కుంభకర్ణ, విభీషణులు జనించారు.

విశ్రవసుని జ్యేష్ఠ కుమారుడయిన కారణాన దముడికి తరువాతి జన్మలో వైశ్రవణుడు అని పేరువచ్చింది. వైశ్రవణుడు చిన్నతనంలోనే పరమేశ్వరునియందు గాఢభక్తి కలిగి ఉన్నాడు. కొన్నాళ్ళకు అతడు పిత్రాజ్ఞయను కాశీకివచ్చి అవిముక్తక్షేత్రంలో తపస్సు చేశాడు. అక్కడనే తనపేర లింగమూర్తియైన పరమేశ్వరుని ప్రతిష్ఠించి ఆరాధించాడు. అతని తపస్సును మహోజ్జ్వలం దీపకళికతో పోల్చవచ్చు. మహేశ్వరుడు వర్తియై జ్వలిస్తున్నాడు. హిమగిరి కన్యక దీపయష్టి. భక్తి విశేషమే తైలం. ధ్యానధార సమధిక విరాజమానమైన జ్వాల. కామక్రోధాది శత్రుషట్కం శలభాలు. ఈ విధంగా విజ్ఞానదీపాన్ని వెలార్చి, కాంతి ధారాజలంచేత అభిషేకించి, భావకుసుమాలతో నిర్మల మనోప్రవృత్తితో వైశ్రవణుడు లింగాన్ని అర్చించాడు.

నిశ్చలభక్తితో అతిదీర్ఘకాలం వైశ్రవణుడు చేసిన తపస్సుకు పరమేశ్వరుడు ప్రత్యక్షమైనారు. ఒక్కసారిగా కోటి సూర్యులు ఉదయించినట్లయింది. జగద్వ్యాపమానమైన ఆ తేజస్సును చూడగానే యాజ్ఞదత్తి లౌకిక నేత్రాలు శక్తిహీనం అయినాయి. అతడు అంధుడైనాడు. దృష్టికోల్పోయిన అతడు అంతఃకరణంలోని ఛాందోగ్య, మాండూక, బృహదారణ్యక, శ్వేతాశ్వతరోపనిషత్తులలోని స్తోత్రం చేత, పంచబ్రహ్మ షడక్షర, ప్రణవాది మంత్రములచేత స్తోత్రం చేశాడు. పరమేశ్వరునకు నమస్కరించి నిరంతరం దేవతాకోటి కోటీరమణీ మణిగణ దీపానీరాజితము అయిన మీ పాదపద్మములను దర్శించే భాగ్యం కలుగజేయవలసిందని ప్రార్థించాడు.

ఆ మాటలతో సదాశివుని మనస్సులో కృపారసంచిప్పిల్లింది. అతని మనోరథం తీర్చదలచాడు. అతనికి మరల దృష్టి దయచేశాడు. అందుకు సంతరించి వైశ్రవణుడు ప్రపంచాన్ని చూడగలిగినాడు. పరమేశ్వరుని దయవలన పినాకపాణిని సైతం అవలోకించగలిగాడు. ఆ సమయంలో తేజోమయదీప్తులు విరాజిల్లుతూ పదారు వత్సరాల ప్రాయంలో ఉన్న అపరూప సౌందర్యవతి శివుని వామభాగం ఒరసుకొంటూ నిలుచున్నది. ఆమె కాలిఅందెలు ఘల్లుమని మ్రోగుతున్నాయి. వానితో మేళవించిన కరకంకణ ధ్వనులు మనోహరంగా, శ్రవణానందకరంగా వినబడుతున్నవి.

ఆమెను చూచి వైశ్రవణుడు ఎందుకో ఈర్ష్య పడినాడు. ఎవ్వరీ కలువకంటి? ఏమి తపంచేసి నాకంటె అధికురాలయింది? మహాశివుని వామభాగంలో అంతచేరువగా స్థానం సంపాదించుకొన్నది. ఈశుడు ఈమెను మిక్కిలిగా మన్నిస్తున్నాడే. ఈమె ఎంతటి భాగ్యశాలి! తన కంటె ఉన్నతమైన స్థానం ఆమెకు లభించిన దన్నట్లు సవతిమత్సరంతో చూచాడు.

ఆ భక్తు డెవ్వరో తనవంక ఈసువదృష్టులతో చూస్తున్నందుకు గిరిరాజపుత్రికి కోపం వచ్చింది. ఆమె సామాన్యురాలు కాదుగదా! జగన్మాత. ఆమె తోడ్పాటు లేకపోతే ఈశ్వరుడు కృత్యపంచకం సాగించ లేడు. ఆమెయే చంద్రమౌళికి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తిని కల్పించి జగత్తుకు ఆధారమవుతుంది. హృల్లేఖామహా మంత్రానికి ఆమె అధిష్ఠాన దైవం. తపస్సుచేత పరమేశ్వరుని మెప్పించి, ఆయన అర్ధశరీరాన్ని పొందగలిగిన పార్వతి. వైశ్రవణుని దృష్టివెనుక గల భావం గ్రహించిన ఆ తల్లి కోపంతో ఇలా అన్నది. నాథా! ఈ దుష్టు డెవడు? ఈ అవంతకుడు క్రీగంటితో నన్ను చూస్తూ వికారాలు

చూస్తున్నారు. ఏమో గొణుగుకొంటున్నారు. వీరికింత యీసేం కలిగింది. నా సౌందర్యానికి అసూయపడుతున్నట్లున్నారు. మీ రెవ్వరూ ఇంతే. గుణదోషాలు విచారించకుండా అందరినీ నెత్తిన ఎక్కించుకొంటారు. మీ రెవరో చెప్పవలసింది!

ఆమె మాటలకు చిరునవ్వు నవ్వి శివలింగుడు ఆమెతో దేవీ! వీడు నాకు అంతరంగిక భక్తుడు. నీకు పుత్రునివంటి వాడు. కొడుకులు దౌర్భాగ్యపుపనులు చేస్తే తల్లిదండ్రులు కోపిస్తారా? తనకన్న ఉన్నతస్థానం లభించిన ఆమె చేసిన పుణ్యం ఏమిటో అని అసూయపడుతున్నాడు. అంతేగాని మనోవికారం కాదు. అవిముక్త క్షేత్రంలో వేల సంవత్సరాలు మహోగ్ర తపంచేసి నా హృదయాన్ని కైవసం చేసుకొన్నాడు. అతనిని కరుణతో చూడు. నేను వరాలిస్తున్నాను. నీవుకూడ వరములు ప్రసాదించు అని శైలపుత్రివైపు చూచి కుమారా! నీ భక్తి నన్ను అలరించింది. దివ్యశక్తి సంపన్నుడవై నీవు యక్ష కిన్నర గుహ్యక లోకాధిపత్యం వహించు. అంతేగాక నా తోటి చిరంతనసాంగత్య సుఖాన్ని అనుగ్రహిస్తున్నాను అన్నారు.

శైలకన్య భర్త మాటల ననుసరించి ప్రసన్నురాలై ఈశ్వరుడు చెప్పిన వరాలన్నీ నీకు సమకూరుతాయి. కాశిలో నీవు నిల్పిన దివ్య లింగాన్ని ఎవరు ఆరాధిస్తారో వారికి సమస్త కోరికలు తీరుతాయి. ఈ ప్రదేశం అత్యంత పుణ్యప్రదమై అలరారుతుంది. కాని వికృతదృష్టితో నీవు నన్ను చూశావు. దాని ఫలితంగా ఎడమకన్ను గ్రుడ్డిదై గవ్వవలె పచ్చగా బాగుంటుంది. మనసున అసూయపడినావు గనుక కుబేరుడనే పేరుతో ఉత్తర దిగాధిపతిగా ఉండగలవు అని దీవించింది. పిమ్మట పార్వతీ పరమేశ్వరులు అదృశ్యమైనారు. కుంతు వరప్రసాదితుడైన

ఉంది. ఆ లోక వృత్తాంతం వినిపించవలసిందని ప్రార్థించాను. దూతలిలా చెప్పసాగినారు.

విప్రవరేణ్యా! శివశర్మా! అది చంద్రలోకం. పగలు తీక్ష్ణకరుడయిన సూర్యునిచే సంతప్తమయిన లోకాన్ని తన సుధామయ కాంతులచే చల్లబరచే ఓషధీ నాథుడయిన చంద్రుడు దీని కధిపతి.

సృష్ట్యాదిని బ్రహ్మ నేత్రములనుండి మరీచి, హృదయంనుండి భృగువు శిరస్సునుండి అంగిరసుడు, ఉదానమున పులస్త్యుడు, వ్యానము నుండి పులహుడు, అపానమునుండి క్రతువు, ప్రాణమునుండి దక్షుడు, శ్రోత్రమునుండి అత్రి, సమానమునుండి వసిష్ఠుడు, సంకల్పమున ధర్ముడు జనించారు.

వీరిలో అత్రిమహర్షి మూడువేల సంవత్సరముల తపస్సుచేశాడు. అతని దీక్షకు ఎల్లరు ఆశ్చర్యపడిన వారే. యోగసమాధిలో ఉన్న అత్రి ఊర్ధ్వరేతస్కుడయి విలసిల్లినాడు. మూలాధార చక్రంనుండి ఊర్ధ్వగత మయిన అతని తేజస్సు బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని బయటకు వచ్చింది. కనుల ద్వారనుండి ఉదకంతయూ పారి దశదిశలా వ్యాపించింది. తేజస్సు భరించలేక దిక్కులు క్రిందకు వ్రాలినాయి. దిగ్దేవతలనుండి జారిన తేజం ఏకంకాసాగింది. విరించి దానికొక రూపం కల్పించాడు. లోకహితం కొరకు ఆ రూపం తనకుతానే అభివృద్ధి పొందింది. అతడే చంద్రుడు.

చంద్రుడు పరమేష్ఠి అనుజ్ఞపొంది కాశీ పట్టణంలోనే అవిముక్త స్థానంలో అమృత లింగభావముతో చంద్రమౌళీశ్వరుని ప్రతిష్ఠించాడు. వేలసంవత్సరాలు పరమేశ్వరుని గురించి తపస్సుచేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై ఓషధీ లోకానికి రాజువు కమ్మని వరమిచ్చాడు.

పిమ్మట చంద్రుడు తన బలంతో లోకాల్ని జయించాడు. హిరణ్య గర్భుడు, అత్రి, భృగువులు ఋత్విజులుగా, శ్రీహరి సదస్యుడుగా రాజ సూయ యాగం నిర్వర్తించాడు. యజ్ఞాంతంలో జయించిన మూడు లోకాలను దక్షిణగా ఇచ్చివేశాడు. అనంతరం మళ్ళీ అవిముక్తక్షేత్రంలో ఇంద్రకుండానికి ప్రక్క చంద్రేశ్వరు డనే పేరున మరో లింగాన్ని ప్రతి ష్ఠించి మరల తపస్సు చేశాడు. పరమేశ్వరుడు ప్రీతిచెంది ప్రత్యక్ష మయినారు. సుధాకరునితో చంద్రా! నీవు నా మూర్తిభేదాలలో ఒకడవు. నీ కాంతి లోకాలకు ఆహ్లాదకరంగా ఉంటుంది. బ్రహ్మదత్తమైన పదాన్ని అధిరోహించి అష్టాదశ ద్వీపాల జయించావు. నిష్కామంగా మరల వాటిని దక్షిణక్రింద దానమిచ్చిన త్యాగివి. కాశిలో చంద్రేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించి ధన్యుడ వయినావు. ప్రతి మాసంలో పూర్ణిమాతిథి నాడు చంద్రేశ్వరుని సన్నిధిని అర్చనలుహోమాదులు నిర్వర్తించేవారికి అనంతకోటిఫలాలు కలుగగలవు. అని చెప్పి అదృశ్యమైనారు.

విప్రవర్యా! ఇక్కడ మరొక విశేషం ఉంది. ఈ ప్రక్కన చంద్రకుండ మనే తీర్థం ఉంది. అష్టమినాడుగాని, చతుర్దశినాడుగాని చంద్రకుండంలో స్నానంచేసి ఈశ్వరుని అర్చించాలి. ఇచ్చటనే పింగళ అనే పేరుతో వెలసివున్న యోగీశ్వరీదేవిని యోగపీఠ నిరూఢను కాశిని గంధ పుష్పాదులతో అర్చించిన వారికి ఏ విఘ్నాలు కలుగవు. చంద్రోదయ సమయంలో ఈ కుండంలో మునిగి, చంద్రేశ్వరుని అర్చించి వసు, రుద్ర ఆదిత్య తర్పణములు చేసిన మానవుడి పితృదేవతలు సంతో షిస్తారు వారి దయకు అతడు పాత్రుడవుతాడు.

దూతల మాటలు పులకిత శరీరుడై వింటున్న శివశర్మ ఎదుట ముత్యముల జల్లివలె ప్రకాశిస్తున్న నక్షత్ర లోకాన్ని చూచి మిక్కలి

ఆశ్చర్యంతో మహాత్ములారా! ఇది ఏ లోకం. దీని వృత్తాంతమంతా సాకల్యంగా చెప్పవలసిందని ప్రార్థించాడు. అందుకా సుశీలపుణ్యశీలురు సంతోషించి ఆ లోక వృత్తాంతం వివరించసాగారు.

మహాపురుషా! సృష్ట్యాదిని బ్రహ్మదేవుని ప్రాణంనుండి దక్షుడు ఉదయించాడని విన్నావు గదా! ఆ దక్షునికి అరవైమంది కుమార్తెలు. అందరూ రూపవిలాస లావణ్యవతులే. వీరిలో రోహిణి మొదలయిన ఇరవైఏడుగురు కాశీకివెళ్ళి నక్షత్రేశ్వరం అనే ప్రదేశాన్ని తమ తపస్సుకు అనువుగా ఎన్నుకొన్నారు. ఆ స్థలం వరుణ అనే నది ప్రక్కన ఉంది. అప్పుడు చంద్రేశ్వరుడనే నామంతో పరమేశ్వరుడు వెలసిఉన్నాడు. ఆ కన్యలంతా వేయి సంవత్సరాలు కఠోరమయిన తపస్సు చేశారు. వారి నిష్ఠకు పరమేశ్వరుడు సంతసించి ప్రత్యక్షమయినాడు. దక్ష పుత్రికలారా! మీ నియమనిష్ఠలు నా కెంతో ఆనందం కలిగించాయి. మీరు కోరిన వరాలు ఇస్తాను. కోరుకోండి అన్నారు. ఆ కన్యకామణులంతా మనస్సున పొంగి పలకండని ప్రోత్సహించేసి, మహాత్మా! నీ దర్శనంతోనే ధన్యులమైనాము. కన్యలేమి కోరుతారో మీకు తెలియదా? నీ అంతటి వాడు మాకు భర్తకావలె. అనుగ్రహించవలసిందని ప్రార్థించారు. గౌరీపతి వారి కోరికను మన్నించాడు. దాక్షాయణులారా! మీ కోరిక నెరవేరుతుంది. నా అంశతో ఉండి ఓషధులకు ఈశ్వరుడు అయిన చంద్రుడు మీకు భర్తకాగలడు. అదీ గాకుండా జ్యోతిశ్చక్రంలో ఎక్కువ ప్రాధాన్యం కలిగి మేషం వృషభం మొదలయిన రాసులకు మీరు కారణభూతులు కాగలరు. తారకలతో కలసి విరాజిల్లుతారు అని వరాలిచ్చి అదృశ్యమయినాడు. వరప్రభావంవల్ల వారు తారకాధిపతికి సతులయినారు. అదే నక్షత్ర లోకం.

14)

దూతలు పై విధంగా చెప్పినారు. ఇంతలో రథం మరొక లోకానికి దాపుకువచ్చింది. చంద్రలోకపు వెన్నెలను పోలిన కాంతులతో విరాజిల్లుతున్న ఆ లోకాన్ని చూచిన శివశర్మకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. దానిని గమనించారు దూతలు. విప్రముఖ్యా! మన్మథునికి అన్యాంతరం, యౌవనానికి ప్రాముఖ్యం కల్పించే బుధుడు ఈ లోకానికి అధిపతి. ఇది బుధలోకం. బుధుని జన్మ గాథ చాల వింతయినది. మిక్కిలి అరుదయినది. ఇతడు చంద్రుని కుమారుడు.

అత్రి కుమారు డయిన శీతకరుని బృహస్పతివద్ద విద్యాభ్యాసం చేయించాడు. చంద్రుడు మిగుల చక్కనివాడు గదా! బృహస్పతి భార్య తార అత్యంత విలాసవతి. యౌవన ప్రారంభదశలో అడుగిడిన సుధాకరుడి అందం ఆమె మనస్సుకు బంధం వేసింది. అతనిపై ఆమెకు కలుగరాని కోర్కె జనించింది. ఎంతగనో నిగ్రహించుకొనటానికి ప్రయత్నించి విఫలురాలయింది. ఆమెలోని కామవాంఛ నానాటికీ గాఢతరమయింది. చివరకు పడగవిప్పి బుసలు కొట్టింది. దానితో వచ్చినా భావన పాపశంక ఆమెనుండి పరువెత్తిపోయినాయి. తానే చంద్రుని ప్రేరేపింపసాగింది. అతను యౌవనవంతుడు గదా! సంయమనం కోలుపోయినాడు. దానికన్నా ముందే విశేషవాశక్తి దూరమైంది. నిజమే, ఆ వయసు వలవంటిది. దానిని గ్రహించి మనస్సునకు కళ్ళెం వేయగల సామర్థ్యం ఎవరికుంది? పరమ మహర్షులు అయినవారే ఎంతమంది కామానికి వశులకై తపోభంగం చేసుకొనలేదు? అంతటి వారిగతి అల్లయితే వీరిదొక లెక్క! 'కామాతురాణాం నభయం నలజ్జా' అనిగదా పెద్దల మాట. చివరకు ఇద్దరూ మన్మథుని చేతిలో చిక్కినారు. అతడు వీరిద్దరిని బొమ్మలవలె ఆడించాడు. సత్పురుషులను, శీలవతులను చేర

గొడ్డటం అనంగుటికి వరకూ. తారాశశాంక నాటకం పరిసమాప్తి కావచ్చింది. తారకూడా దాల్చింది. కొన్నాళ్ళకొక కుమారుని కన్నది. అతడచ్చంగా చంద్రుడున్నట్లే ఉన్నాడు. విధాత ఆబాలుని చంద్రునికి ఇప్పించాడు. ఆత్రేయుడు సుధానిధి కావటంవల్ల చంద్ర సంగమం దోషరహితమని శాసించాడు. చంద్రుడతనికి బుధుడని నామకరణం చేశాడు. తండ్రి అనుమతితో బుధుడు కాశీ పట్టణానికి వెళ్ళాడు. బుధేశ్వరుడనే పేర మహేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడు. ఎన్నో సంవత్సరాలు తపస్సు చేయగా శంకరుడు బుధేశ్వరలింగం నుండి ప్రత్యక్షమయి, ఈ లోకానికి అధిపత్యం ప్రసాదించాడు. నక్షత్ర లోకానికి ఇది పై భాగంలో ఉంది.



అనంతరం దివ్యవిమానం శుక్రలోకానికి చేరువగా వచ్చింది. దేవదూతలు పుణ్యాత్మా! శివశర్మా! ఇదుగో ఈ కనిపించేదే శుక్రలోకం. దీని కధీశ్వరుడు రాక్షస గురువు అయిన శుక్రుడు అతడు మహోగ్ర తపస్వి. కణధూమమే ఆహారంగా వేయి సంవత్సరాలు దుస్సహమైన తపస్సుచేశాడు. పరమేశ్వరుని కృపవలన మృతసంజీవనీ విద్యారహస్యము తెలిసికొన్నాడు. బ్రహ్మ, కుమారస్వామి, విఘ్నేశ్వరుడూ పార్వతీపరమేశ్వరులు తప్ప ఈ విద్య తెలిసినవారులేరు.

పూర్వం అంధకాసురుడనే రక్కసుడుండేవాడు. అతడు తపస్సుచేసి వరాలుపొందిన గర్వంతో సాధుజనుల పీడించసాగాడు. అతని బాధలు పడలేక దేవతలు, మహర్షులు పరమేశ్వరుని ప్రార్థించారు. మహాదేవుడు వారి కభయమిచ్చి అంధకాసుర సంహారానికి పూనుకొన్నాడు. అంధకుడసుర సైన్యంతో పరమేశ్వరుని ఎదుర్కొన్నాడు. ప్రతిదినం యుద్ధంలో పెక్కుమంది రాక్షసులు సంహరింపబడుతున్నారు. అయినా రాత్రికే శుక్రుడు తన మృతసంజీవనీ విద్యామహిమతో చచ్చిన రక్కసులం

మందరిని బ్రతికిస్తున్నారు. దానితో ఎన్నాళ్ళకు రాత్రింబవలు బలం క్షీణింపలేదు. చనిపోయిన అసురులు మరునాడు యుద్ధభూమిలో అగుపిస్తున్నారు. ప్రమథగణాలు ఆశ్చర్యపడి చివరకు ఈ రహస్యం తెలిసిందారు. పరమశివునితో శుక్రుని మృతసంజీవనీ విద్యా రహస్యం వివేదించారు. రుద్రుడు కోపించారు. నందీశ్వరుని పంపి శుక్రుని పిలిపించారు. అతనిని చద్దిమూటను మ్రింగినట్లు మ్రింగివేశారు. గురువును కోల్పోయిన అందరును క్రమక్రమంగా బలాన్ని కోల్పోయినారు. చివరకతడు మహాకాలుని చేతిలో మరణించారు.

శుక్రుడు పరమేశ్వరుని గర్భంలోనుండి వెలికివచ్చి స్వస్వరూపం పొందారు. అనంతరం భార్గవుడు వారణాసి పురానికి పోయి అచట అతనుని లింగరూపాన ప్రతిష్ఠించి, నానావిధపత్ర పుష్పాలచే అర్చించారు. మహేశ్వరుని మెప్పించి యీ లోకాధిపతి అయినారు. ఈ విధంగా దూతలు ఎంతో ఉత్సాహంగా శుక్రలోక వృత్తాంతం వినిపించారు. అంతలోనే విమానం అంగారక లోక పరిసరాలకు వచ్చింది.

దూతలు పుణ్యాత్మా! ఆ కనబడేదే అంగారక లోకం. దాని కధిపతి భూమి పుత్రుడయిన కుజుడు. ఒకప్పుడు పరమేశ్వరుని ఫాలభాగం నుంచి ఒక స్వేదబిందువు జారి భూమిపై పడింది. దానిలోనుండి ఎర్రని శరీరకాంతితో ఒక బిడ్డ జనించాడు. భూదేవి ఆ బిడ్డని తన కుమారునిగా లాలించింది. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడైనాడు. కొంత వయసు రాగానే అతడు తపస్సు చేయవలెనని సంకల్పించాడు. పావన భాగీరథీజలం పరిపూతమైన కాశీ వచ్చి మిక్కిలి తీవ్రంగా పరమేశ్వరుని గురించి తపస్సు చేశాడు. నీలకంఠుడు ప్రత్యక్షమై అతనికి వరాలొసగి అంగారక లోకానికి అధిపతిని చేశాడు. భూమి కుమారునిచే

ప్రతిష్ఠించబడిన లింగమునకు అంగారకేశ్వరుడని పేరు వచ్చింది అని  ఆ లోకాధిపతి వృత్తాంతం వివరించారు. అప్పటికే విమానం బృహస్పతి లోకానికి సమీపంగా వచ్చింది. శివశర్మ దూతలతో పుణ్యపురుషులారా! ఈ లోకం పేరేమి? దీని అధిపతి ఎవరు? ఇది మిక్కిలి కాంతివంతంగా కనబడుతున్నది. అన్నాడు.

దూతలు అతని ఉత్సాహానికి సంతోషించి ఇలాచెప్పారు. విప్రవర్యా! ఇది బృహస్పతి లోకం. దీని అధిపతి దేవగురువు అయిన బృహస్పతి. ఇతడు అంగిరసుని పుత్రుడు. చిన్నవయసులో ఉన్నపుడే బృహస్పతి సమస్తశాస్త్రాల అధ్యయనం చేశాడు. అనంతరం పుణ్యగుణధామమైన కాశీ క్షేత్రానికి వెళ్ళి తపస్సు ప్రారంభించాడు. అత్యంత నిష్ఠతో కఠోరమయిన తపస్సు చేస్తున్న అంగిరసునికి పరమేశ్వరుడు ప్రత్యక్షమయినాడు. విరూపాక్షుని దర్శించగానే బృహస్పతి శంకరా! అర్ధేందుధరా! త్రయనా! భవవినాశా! పన్నగభూషణా! త్రిజగత్పోషణా! భవభంగా! అంబుధివిషంగా! శాంతిదయామధుర హృదయా! పాహిమాం! పాహిమాం! అని స్తోత్రం చేశాడు.

అతని భక్తికి వినయానికి ఈశ్వరుడు సంప్రీతు డయినాడు. అతనితో కుమారా! నిష్ఠతో బృహదుగ్ర తపస్సు చేసినావు. కనుక బృహస్పతి అనే పేరుతో పిలవబడగలవు. ప్రాణములకు ప్రాణమైన భక్తితో తపస్సు ఆచరించి ప్రాణవాయువు మాత్రమే ప్రాణాధారంగా తీసుకొని నన్ను సేవించావు గనుక జీవుడనే పేరు పొందుతావు. వాగాడంబరంతో స్తోత్రం చేశావు కనుక వాచస్పతి అనే నామంతో విరాజిల్లుతావు. అంగారక లోకానికి పైనున్న లోకానికి నీ వధిపతివి కాగలవు. అని వరాలిచ్చి ఈశ్వరుడు అదృశ్యుడయినా

స్మరించారు. సంస్మరణ మాత్రం చేతనే పరమేష్ఠి నిఖిలదేవతా బృందంతో

అక్కడికి వేంచేశాడు. శ్రీకంఠుని ఆజ్ఞచొప్పున విరించి బృహస్పతిని దేవతాచార్య పదవికి అభిషిక్తుని చేశాడు.

బృహస్పతి కాశిలో ప్రతిష్ఠించిన ధిషణేశ్వరుని నిష్ఠతో అర్చించిన వారికి సుజ్ఞానం లభిస్తుంది. పరమేశ్వర తత్వం విదితమౌతుంది. అంటూ విష్ణుదూతలు బృహస్పతి లోకాధిపత్య కథను వివరించారు. అంతలోనే విమానం మరికొంత దూరం పయనించింది. అల్లంత దూరంలో దీప్తివంతమయిన మరో లోకం గోచరించింది. శివశర్మ ఆలోకాలు, వాటి అందాలు చూసి ఆశ్చర్యాంబుధిలో తేలియాడుతున్నాడు. ఆయా లోకాలకు సంబంధించిన గాథలు వింటూ అతడు మహానందపడుతూ తనవంటి అదృష్టవంతుడు మరొకడు లేడని భావిస్తున్నాడు.

పుణ్యశీలుడు ఆ లోకాన్ని చూపుతూ మహాత్మా! ఇది శనైశ్చర లోకం. దీనికి సూర్యపుత్రు డయిన శనైశ్చరుడు అధిపతి. గ్రహములలో ఇతడు మిక్కిలి బలిష్ఠుడు. ఇతని జన్మవృత్తాంతం వినటం ఎంతో ఫలదాయకం.

శ్రీమన్నారాయణుని నాభికమలంనుంచి విధాత జనించాడు. విధాత మానసపుత్రులై అత్రి, మరీచి, దక్షుడు మొదలయిన ప్రజాపతులు జనించారు. మరీచి కుమారుడు కశ్యపుడు. కశ్యపునకు అదితి యందు మార్తాండుడు జనించాడు. ఆదిత్యుడు త్వష్టప్రజాపతి కుమార్తె సంజ్ఞ దేవిని వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు మనువు, యముడు అనే కుమారులు యమున అనే కుమార్తె కలిగినారు.

కొంతకాలం గడిచింది. సంజ్ఞ పాపం చాల సుకుమారి. ఉగ్రకరుడయిన దివాకరుని కిరణ తీవ్రత ఆమెకు భరింపరానిదయింది. కొంత

కాలం పుట్టింటి కేగవలెనని అనుకొన్నది. భర్త అంగీకరించడేమోనని శంకించింది. తనతో సమానముగ, అచ్చుగ్రుద్దినట్లుగ రూపరేఖలు కలిగిఉండే ఒక స్త్రీని ఆత్మశక్తితో సృష్టించింది. ఆమెకు ఛాయ అనే పేరు పెట్టింది. ఆమెను సోదరిగా భావించి ఆమెతో ఛాయా! నేను పుట్టింటికి వెళ్ళి కొన్ని దినాలదాంక రాగలను. అంతవరకు నీవు నా భర్త యైన సూర్యునకు పత్నిగా వర్తించు. ఈ ముగ్గురు బిడ్డలను నీకు అప్పగించి వెళ్ళుతున్నాను. నీ బిడ్డలుగా చూడుకో. నీవు అచ్చముగా నా వలె ఉండటంవల్ల అంతరుడుగాని ఇతరులుగాని నిన్ను గుర్తించరు. నేననే భ్రమతోనే ఉంటారు. ఈ రహస్యం ఎంత ప్రాణంమీదకు వచ్చినా చెప్పవద్దుఅనిచెప్పింది.ఛాయాదేవి సరే అన్నది. సంజ్ఞ పుట్టింటికివెళ్ళింది.

సూర్యుడు ఛాయను సంజ్ఞ అనే భావించి యథాపూర్వముగా గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వర్తిస్తున్నాడు. ఛాయకు సావర్ణి, శనైశ్చరుడు అను పుత్రులు తప్తి అనే కుమార్తె కలిగారు. తనకు బిడ్డలు కలిగిన తర్వాత ఛాయలో స్త్రీసహజమయిన సపత్నీమాత్సర్యం అంకురించింది. తన సంతానంపై చూపించే ప్రేమ, అనురాగం సవతి పిల్లలపై చూపలేక పోయింది. తిండి లాలనలోను, అలంకారాలలోను భేదం చూప సాగింది. చిన్నవాడు కావటంవల్ల యముడు తల్లి ప్రవర్తనను సహించలేకపోయాడు. ఒకనాడు కోపంపట్టలేక ఛాయను కాలితో తన్న దానికి ప్రయత్నించాడు. అతని దురుసు తనానికి ఛాయాదేవి ఓర్చుకొన లేకపోయింది. ఆమెలో సహనం నశించింది. సంజ్ఞ చెప్పినమాట విస్మరించింది. పసివాడన్న కరుణ ఆమెలో లేకుండాపోయింది. చిన్న తప్పుకు తాను విధింపబోయేది ఎక్కువ కఠినమయిన శిక్ష యన్న విషయం ఆమెలో శూన్యమయింది. యముడి పాదం తెగి పడుగాక అని శాపం

కల్పించింది. ఆమెకూడా స్త్రీయే కదా! విద్వంసం కనలేదా! తనయుడ్డే ఆ తప్పుచేసి ఉంటే ఆమె ఆ శాపం ఇచ్చి ఉండేదా! ఈర్ష్యాద్వేష క్రోధాలు జ్ఞానాన్ని నశింపచేస్తాయని పెద్దలంటారు. దేవతలుసైతం ఒక్కొక్క సమయంలో ఈ క్రమత్వానికి అధీనులై ఒకరు తెలియని స్థితిలో పుణ్య పాపాలు, న్యాయాన్యాయాలు, వివేచనా లేకుండా ప్రవర్తిస్తారు. అలాం అప్పుడు ఇక మానవుల విషయం చెప్పేదేముంది!

యముడు శాపగ్రస్తు డయినాడని సూర్యునకు తెలిసింది. ఛాయా దేవిని నిశితంగా పరిశీలించాడు. ఆమె నిజంగా సంజ్ఞాదేవేనా! సంజ్ఞే అయితే కుమారుడు తప్పుచేస్తే తల్లి ఇంతటి శాపం ఇస్తుందా! అన్న సందేహం కలిగింది. వెంటనే ఛాయతో తన మనస్సులోని సంశయాన్ని గూర్చి ప్రశ్నించాడు. నీవు సంజ్ఞవు కావు. ఎవ్వరివో యథార్థం చెప్ప వలసిందని అడిగాడు. ఛాయ అప్పుడు సంకటంలో పడింది. సత్యాన్ని చెప్పకపోతే భర్త శపిస్తాడేమో! లేక తనకు మరొక దండన విధిస్తాడో! అన్న భయంతో జరిగిన విషయాలు అన్నీ దాచకుండా వివరించింది. జరిగిన గాథను తెలుసుకొన్న దినకరుడికి ఛాయయందు ఎక్కువ రోషం కల్పించలేదు. ఆమె ఇచ్చిన శాపాన్ని మరలించలేక తనతి, యముని ఓదార్చి నాయనా! నీ పాదాన్ని క్రిమికీటకాదులు తొలిచి తినగా ఊడిపడు తుంది. చింతించకు అని చెప్పి సంజ్ఞాదేవి కొరకై మామయైన త్వష్ట ప్రజాపతి గృహానికి వచ్చాడు. ఇంటికి వచ్చిన అల్లుడికి ప్రజాపతి తగినట్లు మర్యాదలుచేశాడు. సూర్యుడు సంతుష్టిపడి సంజ్ఞను గురించి ప్రశ్నిం చాడు. త్వష్టప్రజాపతి అల్లునితో సహస్రకరా! నీ కిరణముల తీవ్రతను భరింపలేక సంజ్ఞ ఇక్కడికి వచ్చింది. ప్రస్తుతం కురుక్షేత్రంలో తపస్సు చేస్తున్నదని వివరించాడు.

సూర్యుడు వెంటనే బయలుదేరి కురుక్షేత్రం చేరాడు. అక్కడ సంజ్ఞాదేవి బడబారూపం ధరించింది. ఆ అశ్వం కాలిగిట్టల ధ్వనులు దశదిశల ప్రతిధ్వనిస్తున్నాయి, తెల్లటి కేశ వెన్నెలకాంతులు విరజిమ్ముతున్నది. విశాలమయిన తెల్లగా ప్రకాశిస్తున్న కాళ్లు నల్లగా కుమ్మరం వలె ప్రకాశిస్తున్నాయి. కొదమగోడిగ రూపంలో ధ్యానవిమగ్నమయిన ఆమెను చూడగానే భోగమూలంతటానికి కూడ మనస్సు చలించింది. చిరకాలవిప్రయోగం అనుభవించినారుగదా ఆ దంపతులు. సూర్యునకు మన్మథ వికారం ఆవిర్భవించింది. కామావస్థుడయినాడు. తానుకూడ అశ్వరూపం ధరించి ఆమెవద్ద కేగినాడు. సంజ్ఞాదేవి వచ్చినవాడు భర్త అని తెలుసుకొంది. ఆమెకూడ విరహసంతప్తయే. అందువలన భర్త కోరికకు అనుగుణంగా ప్రవర్తించింది. అశ్వ రూపంలో విహరించిన ఆ దంపతులకు ఇద్దరు కుమారులు జనించారు. వారే అశ్విని దేవతలనే పేరుతో దేవవైద్యులయినారు. అనంతరం సంజ్ఞా సూర్యులు అశ్వ రూపాలు వదలి నిజ రూపాలతో స్వగృహం చేరినారు.

శనైశ్చరుడు వారణాసికేగి లింగస్థాపనచేసి మహేశ్వరుని అర్చిస్తూ ఘోరమైన తపస్సుచేసి ఆరాధించాడు. శంభుని కరుణా విశేష కారణంగా అతడు శనైశ్చర లోకానికి అధిపతి అయినాడు. అతడు ప్రతిష్ఠించిన లింగము శనైశ్చరేశ్వరుడని పేరుతో ప్రసిద్ధికెక్కింది. శుక్రేశ్వర లింగానికి ఉత్తరభాగంలో ఇది ఉంటుంది. శనైశ్చర లింగాన్ని అర్చించిన వారికి భోగమోక్షాలు కరతలామలకములు.

అంతలో విమానం మరికొంత పైభాగానికి పయనించి సప్తర్షి మండలానికి దాపుగా వచ్చింది.

# సప్తర్షిలోక వృత్తాంతం



ఈ లోకాన్ని చూస్తూ దూతలు మహాభాగా! ఇది సప్తమహర్షుల లోకం. సమస్త ఐశ్వర్యాలను ప్రసాదించగలదు సుమా! బ్రహ్మమానస పుత్రులయిన మరీచి, సంభూతి యనే కన్యను, అత్రిమహర్షి అనసూయను పులస్త్యుడు క్షమను, పులహుడు ప్రీతియనే కన్యను, అంగిరసుడు స్మృతిని, క్రతువు సన్నతి అనే లతాంగిని, వసిష్ఠుడు ఊర్జ (అరుంధతి) అనే భామినిని వివాహం చేసుకొన్నారు. వీరు బ్రహ్మ ఆదేశానుసారం ప్రజాపతులను సృజియించి సృష్టి విస్తరణకు సహకరించారు. అనంతరం వీరేడుగురు కాశీ పట్టణంలోని అవిముక్త క్షేత్రంలో తమతమ నామాంకితాలయిన లింగేశ్వరులను ప్రతిష్ఠించి ఉగ్రమయిన తపస్సు చేశారు. సప్తమహర్షుల సతులుకూడ తాము ప్రత్యేకంగా మహేశ్వరుని ప్రతిష్ఠించి ఆరాధించారు. అవన్నీ వారివారి పేర్లతోనే పిలువబడుతున్నాయి. వారి నిష్ఠకు, భక్తికి మెచ్చిన నీలకంఠుడు ఈ లోకాన్ని సృజించి దాని ఆధిపత్యాన్ని సప్తర్షులం కొసంగినాడు. సప్తమహర్షులు వారి భార్యలతో ఈ లోకంలో సుఖంగా నివసిస్తుంటారు.

# ధ్రువపదం

అనంతరం విమానం ధ్రువలోక సమీపానికి వచ్చింది. ఆ లోకాన్ని చూపి దూతలు దాని వృత్తాంతం వివరించారు.

మహాభాగా! విశ్వకర్మ! ఇది ధ్రువలోకం. ఆకాశలక్ష్మికి కంఠహారమై, శ్రీమన్నారాయణుని అంఘ్రిపీఠంగా ప్రసిద్ధికెక్కింది. ఇది తారక సమూహానికి తులాదండయష్టి. గ్రహ సమూహాన్ని తనచుట్టు

త్రిపృ[illegible]నే అయస్కాంతం. మహామత్స్యము యొక్క తోక చివరిభాగం. ఈ లోకానికి అధిపతి ధ్రువుడు. అతని వృత్తాంతం సకలకల్మషహరం.

స్వాయంభువ మనువునకు ఉత్తానపాదుడనే కుమారుడున్నాడు. అతడు చక్రవర్తియై భూమిని పాలిస్తున్నాడు. ఆయనకు సునీతి సురుచి అనే ఇద్దరు భార్యలున్నారు. సునీతికి ధ్రువుడనే కుమారుడు, సురుచికి ఉత్తముడనే పుత్రుడు జనించారు. ద్వితీయ భార్య సురుచిమీద రాజుకు ప్రేమాభిమానాలు ఎక్కువ. పట్టమహిషియైన సునీతికి ఇది కొంచెం కష్టముగా ఉండేది. అయినా ఆమె ఓర్పుతో సవతి తనను అవమానించినా సహించేది కాని, పరుషంగా మాట్లాడేది కాదు. సురుచికి తాను అందగత్తెనని గర్వం. భర్త తనను ఎక్కువగా ఆదరిస్తాడని ఆమె టెక్కు. పిల్లలిద్దరు పంచవర్ష ప్రాయులయినారు.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి అంతఃపురంలో భార్యతో వినోద గోష్ఠిలో ఉన్నాడు. చిన్న కుమారుడయిన ఉత్తముడు ఎక్కడనుంచో వచ్చి తండ్రి తొడపై ఎక్కి కూర్చున్నాడు. ఇంతలో ధ్రువుడుకూడ అక్కడికి వచ్చాడు. తండ్రి ఒడిలో తమ్ముడు ఉండటంచూచి తానుకూడ రెండవ తొడపై కూర్చోవలెనని తండ్రికి సమీపంగా వెళ్ళాడు. పాపం ఉత్తానపాదుడు చేయి చాపాడు. ధ్రువుడు ఉత్సాహంగా ముందుకు అడుగు వేశాడు. ధ్రువుడు తండ్రి తొడపై అధివసించటం సురుచికి అయిష్టం. సవతి కొడుకు తన అంతఃపురంలో తన యెదుట తండ్రి ఉత్సంగంమీద కూర్చోవటమా! తనకెంత అవమానకరం. అసహనాగ్ని చేతప్తమయిన సురుచి వెంటనే ముందుకువచ్చి ధ్రువుని చేయిపట్టి వారించింది. అంతటితో ఊరుకొనక నీ తండ్రి తొడపై అధివసించే భాగ్యం నీకుంటే నిర్భాగ్యురాలయిన సునీతి గర్భవాసాన ఎందుకు జనించి

ఉంటావు ? అని కఠినంగా మాట్లాడింది. ఏ పాపమెరుగని ఆ పసి వానికి ఆ మాటలు వినగానే దుఃఖం ముంచుకొని వచ్చింది. కండ్లవెంట జలజల నీరు కారసాగింది. ఉత్తమస్థితి పొందాలనే కోరిక జనించింది. దానికి తపస్సే మార్గమను కొన్నాడు. ఏకాయెకిని గృహానికి వెళ్ళి తల్లికి జరిగినదంతా చెప్పుకొని బావురుమన్నాడు. అమ్మా! నేను అరణ్యానికి పోయి తపస్సుచేసి ఉత్తమస్థితిని పొందుతాను ఆశీర్వదింపవలసినదన్నాడు.

కొడుకు మాటలు విన్న సునీతికి కడుపుచెరువయింది. బోరున దుఃఖించింది. సవతి తనను అవమానిస్తున్నది సరే. ఇప్పుడు అభంశుభం తెలియని తన కుమారునికూడ అవమానించడమా! అందునా తండ్రిఎదుట. ఆ తండ్రి నిస్సహాయుడివలె ఊరుకొని ఆమె అకృత్యాన్ని ఆమోదించడమా! కడుపు భగ్గుమన్నది. కాని ఆమె అభాగ్యురాలు, ఏమిచేయలేని దుస్థితిలో ఉంది. కొడుకును కౌగిలించుకొని ఏడ్చినది. నాయనా! ఎంత దౌర్భాగ్యురాలనురా ! యువరాజువు కావలసిన వాడవు. పట్టమహిషి సుతుడవు. కాలు క్రిందపెడితే కసుగంది పోతుందని సేవకులచే సేవ చేయించుకొనవలసినవాడవు. మహాభయంకర మృగాలతో కూడిన అడవికి పోయి కఠినమైన తపస్సు చేయుటమా ! ఇంతుగా ఐదేండ్లు లేవు నీకు. నామాట విను. అడవికి పోవలదు. ఒకప్రక్కన తండ్రియొక్క అనాదరణ. మరొకవంక సవతి అవమానములచే సంతప్తమౌతున్న నాకు నీ దర్శన లాలనాలు సాంత్వనము. అట్లాంటి నీవుకూడ దూరమైతే నే నెలా జీవించేది అని ఎన్నోవిధాల బ్రతిమాలుకొన్నది. ఆ బాలుని హృదయం ఎంత గాయపడిందోగాని అతడు తనపట్టు విడలేదు. తల్లి అనుమతి తీసుకొని వనానికి బయలుదేరినాడు.

త్రోవలో ధ్రువునికి సప్తమహర్షులు ఎదురైనారు. బాలధ్రువుని

చూచి సప్తమహర్షులు ఈప్సితము అవగతం చేసుకొన్నారో ఏమో ఆదరంగా పిలిచి అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు. ఆశీర్వదించి వెళ్లి పోయినారు. సప్తర్షుల దర్శన భాగ్యంతో ఆతనిలో మానసోత్సాహం పెల్లుబికింది. తిన్నగా నడచిపోయి యమునాతీరాన వనం ప్రవేశం ఎన్నుకొని తపస్సుకు ఉపక్రమించాడు. ప్రకృతి వైపరీత్యాలను సమయం లెక్కచేయకుండా ఏకాగ్రబుద్ధితో ఉగ్రతపం చేయ నారంభించాడు. ధ్రువునిపై నారాయణునకు అపారమైన దయ కలిగింది. వెంటనే ప్రత్యక్షమై ఆ బాలుని తన అమృతహస్తంతో స్పృశించాడు. ధ్రువుడు కండ్లు తెరచి ఎట్టఎదుట ఉన్న పురుషోత్తముని చూచి ఆనందంతో నమస్కరించాడు. అతనిని లేవదీసి పరమాత్మ నాయనా! ధ్రువా! పరమమహర్షులకు అంది గాని ఏకాగ్రతను సాధించి తపస్సు చేసినావు. నాకెంత ఆనందం కలిగించిన నీకు లోకోన్నతము అత్యుత్తమమైన స్థానాన్ని ప్రసాదిస్తున్నాను అని వరమిచ్చి తనతో బాటుగరుత్మంతునిపైన ఊరేగించి కైలాసంలోపరమేశ్వరుని దర్శించాడు. పార్వతీనాథుడు ధ్రువుని ఆలింగనం చేసుకొన్నారు. చంద్రధరుడు ఇచ్చిన వరాలు మనసున తలచి ఈశ్వరుడు ఆ బాలుని గ్రహచక్రవాళమునకు పైభాగమునఉన్న లోకానికి అధిపతిగ చేసి ధ్రువకుమారా! చిరకాలం భూలోకంలో రాజ్యంచేసి జన్మాంతరంలో ఈ లోకంలో నివసింపగలవు అని ఆదరంతో పలికాడు.

విష్ణువు వైనతేయుడు ధ్రువుని నగరానికి తీసుకొనివచ్చాడు. ధ్రువుడు మణికర్ణికాఘట్టంలో స్నానంచేసి అవిముక్తక్షేత్రంలో మహేశ్వరలింగమును ప్రతిష్ఠించి ఆరాధించాడు. పంచాక్షరీమంత్రప్రభావితుడయిన ధ్రువుడు గృహానికి మరలివచ్చాడు. కుమారుని వృత్తాంతం విన్న ఉత్తానపాదుడు భార్య లిద్దరితో ససైన్యంగా ఎదురువచ్చి స్వాగతమిచ్చాడు. నక్షత్ర

సవతి సురుచి తనను క్షమించమని వేడుకొనుచుండగా ఎంతో ఆదరంగా ధ్రువుని కౌగలించుకొంది. సునీతి ఆనందానికి మేరలేదు.

తండ్రి అనంతరం ధ్రువుడు సింహాసనాధిష్ఠితుడై పెక్కువత్సరాలు ప్రజానురంజకంగా రాజ్యాన్ని పాలించాడు. విశ్వనాథుని కృపవలన జన్మాంతరంలో అతడు ధ్రువపదాన్ని పొందినాడు. కాశిలో ధ్రువేశ్వరుని అర్చించినవారికి స్థిరమైన బుద్ధి కలగడమేగాక ధ్రువమైన పదంకూడ లభిస్తుంది.

ఈ విధంగా ధ్రువలోక వృత్తాంతం వివరిస్తుండగనే విమానం ధ్రువలోకాన్ని గడచి క్రమక్రమంగా మహాలోక, జనలోక, తపోలోకాలను దాటి సత్యలోకానికి సమీపానికి వచ్చింది. పార్శ్వరతులు, శివశర్మను చూచి మహాత్మా! ఈ దాపేమేది సత్యలోకం. పరమానందదాయకమయింది. ఇదే చతుర్ముఖునికి ఆవాసమైనట్టి పుణ్యలోకం అని తెల్పి సత్యగర్భుని సముఖానికి కొనిపోయినారు.

వాణీపతి శివశర్మను సాదరంగా సత్కరించి ప్రసంగవశాన కాశిలో మరణించినవారికిగాని ముక్తిలభించదని తెలిపి సముచిత మర్యాదలతో సాగనంపాడు. ఏవి చెప్పి అన్న మాటలకు శివశర్మ సందేహపూరిత మనస్కుడయినాడు. అంతలోనే కింకరులతో మహాభాగులారా! మనమింకా ఎంతదూరం ప్రయాణం చెయ్యవలసి ఉంటుంది. పితామహుని మాటలు మీరుకూడా విన్నారుగదా! వారణాసిలో శరీరం త్యజించనిదే మోక్షం లేదనినాడు. మరి నాకు నిశ్శ్రేయసం సంప్రాప్తించే విధం తెలియజేసి కృతార్థుని గావింపవలసిందని అన్నాడు.

దానికి కింకరులు మహాత్మా! భూమికి ఎనిమిది కోట్ల యోజనముల ఎత్తున ఈ సత్యలోకముంది. సత్యలోకానికి ఎనిమిది కోట్ల యోజనా

ంతు పైభాగంలో విష్ణులోకమయిన వైకుంఠం ఉంది. దానికి పదహారు కోట్ల యోజనాల ఊర్ధ్వంగా శివలోకం ఉంది. ఆ లోకమే కైలాసం. దానిని వర్ణించటానికిగాని, ప్రస్తుతించటానికిగాని బృహస్పతి, బ్రహ్మంతటి కూడ శక్యంగాదు. ఆ లోకంలో గిరిరాజకుమారీ సహితుడయిన పరమేశ్వరుడు నివసిస్తూ ఉంటాడు. నందీశ్వర, భృంగీశ్వర చండీశ్వరాది గణాధిపతులు ఆ దంపతులను సేవిస్తూ అక్కడే ఉంటారు. ఆ పరమేశ్వరుడే భువనసంరక్షణార్థం శ్రీమన్నారాయణునకు చతుర్దశభువనాధిపత్యానికి పట్టాభిషేక మొనర్చినాడు.

ఆ పట్టాభిషేక వైభవం ఇంతింత అనరాదు. పదారువన్నె బంగారపు గుబ్బ క్రొమ్మెరుగుల తళతళలతో ప్రకాశిస్తున్న రత్నదండం. శరత్కాలపు వెన్నెల కాంతులను తిరస్కరించే మేలిపట్టుపత్రం. ముత్తు పగడాల జాలరులతో ప్రకాశిస్తున్న వెల్లగొడుగును వినాయకుడు విష్ణువునకు పట్టినాడు, పార్వతీదేవి స్వయంగా ఆ పుండరీకాక్షుని అలంకరించింది. సరస్వతీదేవి రత్నదర్పణం చూపింది. శచీదేవి మాణిక్య దీపములతో నివాళించింది. చాముండి తాళం వేస్తుంటే భృంగీశ్వరుడు నృత్యం చేశాడు. సూర్యచంద్రులు ఇరుపయిపుల వింజామరలు వీచారు. యముడు వేత్రదండం ధరించాడు. వాణీదేవి మృదుమధుర కంఠస్వనముతో గద్య పద్య మాలికల స్తోత్రాలు చదివింది. గణాధిపతులు, సప్తర్షులు, దిక్పాలకులు, మరుద్గణము, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, దేవనివహం అందరూ నారాయణునకు నమస్కరించారు.

పట్టాభిషేక మహోత్సవం ఎంతో వైభవంగా జరిగింది. అనంతరం నీలకంఠుడు మేఘగంభీరస్వరంతో పలికాడు: పరమేష్ఠి! విష్ణువే

నేను. నేనే శివుడను. మా ఇద్దరికి భేదంలేదు. శ్రీహరి కళ్యాణ ప్రదుడు. అగ్రరక్షణపరాయణుడు. అనాదినిధనుడు. సమస్త కల్మషము లను హరింపగలడు. మీ రతనిని సేవించండి అని పలికి తన లోకమున కేగినాడు. దేవత లంతా ఎవరి లోకాలకు వారు వెళ్ళినారు.

కావున శివశర్మాభిధానా! ఈ కథను చతుర్భుజ పట్టాభిషేకం అంటారు. దీనిని చదివినా, విన్నా, వ్రాసినా సమస్త ఐశ్వర్యాలు లభి స్తాయి. నీవు విష్ణులోకంలో బ్రహ్మసంవత్సరపర్యంతం విహరించగలవు. అనంతరం నీ పుణ్యపరిపాకంవలన భూలోకంలో వృద్ధకాలుడనే పేర జనించి నందివర్ధన నగరానికి రాజు కాగలవు. అనేక సంవత్సరాలు రాజ్యం చేసి సుతులకు రాజ్యాన్ని అప్పగించి నీవు కాశీ కేగి విశ్వనాథుని సేవించి మోక్షాన్ని పొందగలవు అని అతని సందేహం నివృత్తి చేశారు. అంతలోనే విమానం వైకుంఠం చేరింది. కింకరులు సగౌరవంగా శివ శర్మను లోపలికి తీసుకుపోతున్నారు. ఆ వైకుంఠనగర రామణీయకతకు ఆశ్చర్య పడుతూ అతడు వారివెంట పోయి త్రిభువనమోహనరూపుడయిన శ్రీ మహావిష్ణువును సందర్శించాడు. పుండరీకనయనుడు శివశర్మను సాద రంగా ఆహ్వానించాడు. వారు చెప్పినట్లు శివశర్మ వైకుంఠంలో నిత్యా నందుడై కొన్నివేల సంవత్సరాలు గడిపాడు. అనేక భోగాలు, సుఖాలు అనుభవించాడు. పిమ్మట భూమిమీద జనించి కాశీవిశ్వనాథుని సేవించి మోక్షం పొందాడు.

అగస్త్యుడు లోపాముద్రకు ఈ శివశర్మ కథ సవిస్తరంగా చెప్పి, ప్రియా! శ్రీశైలాది ఇతర క్షేత్రాలు మోక్షాన్ని ఇయ్యగలవు. కాని కాలవ్యవధానం కల్గుతుంది. కాని కాశీపట్టణం వెంటనే ముక్తిని ప్రసాదించగలదు అని చెప్పి ఆమె సందేహాన్ని తీర్చాడు.

# పంచమాశ్వాసం

లోపాముద్ర అగస్త్యుడు సౌమమంత చేరారు. కుంకలాబి రాకను అల్లంతదూరాన గమనించిన కుమారస్వామి అగస్త్య దంపతులకు ఎదు రేగి అర్ఘ్యపాద్యాదులొసగి ఆహ్వానించాడు. కుశలప్రశ్నల అనంతరం షణ్ముఖుడు అగస్త్యునిచూచి పరమ మహేశ్వరుడ మయినమీరాక నాకెంతో సంతోషం కలిగించింది. మీ రాకకు గల ప్రధాన కారణం వివరించమని ప్రశ్నించాడు. అతని సత్కారానికి ఆదరానికి మురిసిన ఆనందపడిన అగస్త్యుడు కుమారా! కొల్హాపురిలో లక్ష్మీదేవి ప్రత్యక్షమై నీ వలన కాశీ మాహాత్మ్యం తెలుసుకొనవలసిందని ఆదేశించింది. ఆమె ఆదేశానుసారం ఇలా వచ్చి నీ దర్శనం చేసుకొన్నాను అని జరిగిన విషయమంతా వివ రించి కాశీమాహాత్మ్యం తెలుపవలసిందని ప్రార్థించాడు. కుమారుడు అగస్త్యునితో కలశజమౌనీ! నేను ఆరుముఖములు కలవాడినే. వేద శాస్త్రార్థములు ఎరిగినవాడనే. అయినప్పటికీ కాశీమాహాత్మ్యం వర్ణించ డానికి సమర్థుడను కానుసుమా! నీ యంతటివాడు అడిగినప్పుడు తెలిసిన విషయం వివరించకుండ ఉండటం న్యాయం కాదు. కావున నేను ఎరిగినంతవరకు వర్ణిస్తాను. కొల్హాపురి శ్రీమహాలక్ష్మి విన్నివ్వటకు పంపటం నాకు ఆనతియే. అనగానే లింగగర్వాపహారి పార్వతీ తనయునకు నమస్కారం చేసి మహాత్మా! కాశీలోని అవిముక్తక్షేత్రం మోక్షకారణమని, మణికర్ణిక తీర్థరాజములకెల్ల ప్రశస్తమయినదని, వార ణాసి క్షేత్రమే అవిముక్తమని. ఆనందకాననమని, మహాశ్మశానమని, రుద్రావాసమని వివిధనామములతో ప్రసిద్ధికెక్కిన కారణంతెలుపవలసిందని అర్థించాడు.

శరవణభవుడు అతని ప్రశ్నకు సంతసించాడు. కాశీపై శ్రద్ధాసక్తి

దర్శించటానికి ఏ వారికీ ఔత్సుకత ఉండదు. వాతాపిదమనా! వారణాసి గొప్పతనాన్ని ఒకప్పుడు మా తండ్రి పరమేశ్వరుడు మా తల్లియైన భవాని దేవికి చెప్పినాడు. నాకు దానిని వినేభాగ్యం కలిగింది. నాడు పితృ దేవుడు చెప్పిన విధం వివరిస్తాను.

పరమేశ్వరుడు కాత్యాయనితో ఇలా అన్నాడు. పార్వతీ! బ్రహ్మకల్పం పూర్తయినపుడు సమస్తలోకాలను మాయ ఆవరించింది. పరమాత్మనుకూడ మహామాయ ఆచ్ఛాదించింది. లోకమంతా జలాప్లవము అయింది. సముద్రాలన్నీ తరంగరహితాలుగా స్తబ్ధంగా ఉన్నాయి. ఆకాశ మొక్కటే మిగిలింది. తక్కిన భూతాలన్నీ అస్మృతాకారములయిన వాటిలో విలీనమౌతున్నాయి. అంధకారం దట్టంగా వ్యాప్తిచెందింది. సత్తుగాని అసత్తుగాని తెలియుటకులేదు. వెలుగిచ్చే సూర్య చంద్రాది గ్రహాలు తారకలు లేవు. భూతములతోనే శబ్దస్పర్శరూపరస గంధాది పంచతన్మాత్రలు లయించాయి. బ్రహ్మాండమే నిష్ప్రపంచమయింది. పరబ్రహ్మం రూపవర్ణాదులు లేక అవాఙ్మానసగోచరమయింది. అప్రమేయం, అనాధారం, అవికారం, నిర్గుణం, నిర్వికల్పం, నిరాలంబం, నిరామయం, నిరుపద్రవమై పరబ్రహ్మం తూష్ణీంభావాన్ని గైకొని ఉండికూడా లీలార్థం తనమించి ఒక శక్తిని కల్పించాడు. ఆ స్వరూపం నీవే! పురుషాకృతిలో గోచరిస్తున్న ఆ పరబ్రహ్మ రూపాన్ని నేనే. కల్యాణీ! ఆ అనాదికాలంలో ఉనికికి ఎక్కడా చోటులేక మనం అవిముక్త మంటపానికి చేరాము. నాటినుండి నేటివరకు మనం ఈ కాశీపట్టణంలోనే నివసిస్తున్నాము.

ఎల్లప్పుడు మనం వదలకుండా ఈ క్షేత్రంలో ఉండటంవలన దీనికి అవిముక్తక్షేత్రం అనే పేరు కలిగింది. ఈ ప్రదేశం మనకెంతో

ఆనందం పూర్ణమని కావటంవల్ల ఆనందవనం అని పిలువబడుతున్నది. నా నివాసస్థాన మెప్పుడూ శ్మశానం కావటంచేత ఇది మహాశ్మశానమని పిలువబడింది. నేనే రుద్రుడను. నాకు నివాసభూమి కావటంవల్ల రుద్రావాసమని, రుద్రాగేహమని పేరు కలిగింది. ఇక్కడ వరణ, అసి అనే రెండునదులు ప్రవహించటంచేత ఆ రెండు పదాంకలయికతో ఇది వారణాసి అనే ఖ్యాతి కలిగింది. కాశృదీప్తి - అంటే ప్రకాశించేది అని అర్థం. దానివలన కాశి అనే నామంతో పిలువబడుతున్నది. ప్రళయం సంభవించినపుడు నక్షత్రములు గ్రహములతో సహా యావదఖండం కాలం గతిలో ప్రవేశమైనపుడు సయితం కాశీక్షేత్రం ఉనికిగలిగి నివాసయోగ్యం గానే విలసిల్లుతుంది అని కాశికి కల వివిధనామములు ఎలా వచ్చింది వివరించి శంభుడు కుంభజునికి మణికర్ణికా మాహాత్మ్యం వివరించారు. నే విస్తృతంగా తెల్పుతాను. సావధానంగా వినవలసిందని కుమారు డిలా చెప్పాడు.

## మణికర్ణికా మాహాత్మ్యం

కాశీనగరంలో నివసిస్తున్న పరమేశ్వరుడు ఒకనాడు భవానితో కుటుంబ రక్షార్థం ఒకరిని సృష్టించాలని ఆలోచన చేశాడు. సంకల్ప మాత్రాన సృష్టి చేయగల మహేశ్వరుడు పార్వతీదేవి ముఖాన్ని అర కంట వీక్షించాడు. ఆ చూపులోనే పీతవస్త్రంగల ఒక మహాపురుషుడు ఉదయించారు. చతుర్భుజములతో శంఖ, చక్ర, గద, అసి శార్ఙ్గాది దివ్యా యుధాలు ధరించి ఉన్నారు. అతని నాభిన ఒక కమలం ఉదయించి ఉంది. అజానుబాహువులతో, సుగుణములతో ఒప్పారుతున్నారు. ఇందు చంద్రుని గెలిచేసే ముఖం, పద్మదళములతో సమానమైన నేత్రాలు లోక సమ్మోహనమైన రూపం కలిగిన ఆ పుండరీకాక్షుని చూచి ఈశ్వరుడు

నీలమేఘవర్ణంతో ఉన్న నీవు కృష్ణనామంతో పిలవబడుతూ కాశీపుర ప్రాంతం అయిదుక్రోసుల దూరం ఈ రాజ్యభారాన్ని నీవు వహించవల సింది అని సామ్రాజ్యభారం వహించటానికి ఆతనిని నియోగించాడు.

జనార్ధనుడు శివాజ్ఞ ఆదేశానుసారం చక్రంతో పుష్కరిణి త్రవ్వినాడు. ఆనాటి సమయంలో మహావిష్ణువు శరీరంనుంచి జనించిన ఘర్మజలంతో పుష్కరిణి నిండింది. ఆ సరస్తీరంలో నారాయణుడు వేయి ఏబయిది సంవత్సరాలు శివునిగూర్చి దుస్సహమైన తపస్సు చేశాడు. పర మేశ్వరుడు ప్రత్యక్షమై పుష్కరిణిని చూచి మిక్కిలి ఆనందపడినాడు. ఉత్సుకతతో పుష్కరిణిని చూస్తుండగా శివుని మణివిరాజిత కర్ణావతంసం జారి పడిపోయింది. మణికర్ణిక పడిన ఆ చక్రపుష్కరిణి అప్పటినుంచి మణికర్ణిక అనే పేరుతో ప్రసిద్ధమైంది.

విష్ణువు నారాయణుని కోరికపై నీలకంఠుడు మణికర్ణికా ప్రాశస్త్యం వివరించాడు. ఈ తీర్థంలో స్నానమాడి, తర్పణ జప హోమ వేదాధ్యయనాదులు, వ్రతములు, లింగ ప్రతిష్ఠ చేసినవారికి అక్షయమైన మోక్షం లభిస్తుంది. సమస్త లోకాలలో ఇప్పుడున్న తీర్థాలు మణికర్ణికతో సమానం గావు.

సాంఖ్య యోగం, ఆత్మావలోకనం, అశేష వ్రతాలు మణికర్ణికా తీర్థంలో స్నానమొనర్చినదానికి సమానంగావు. కాశీపట్టణ పంచక్రోశ ప్రాంతంలో క్రిమికీటకాదులు, జంతుసంతానాలు మరణిస్తే నిర్వాణలక్ష్మి కరతలామలకం అవుతుంది. కాశీక్షేత్రంలో ఎప్పుడూ కృతయుగమే. ఎప్పుడు ఉత్తరాయణ పుణ్యఫలమే లభిస్తుంది. కాశిలో అయిదు దినాలు నివసించినంత మాత్రాన చతుర్వేద అధ్యయనంవల్ల కలిగే పుణ్యం లభిస్తుంది. ఈ పుణ్యక్షేత్రంలో మూడహోరాత్రాలున్నవారికి అశ్వమేధ

రాజసూయాది మహాధ్వరాలు చేసిన ఫలితం లభిస్తుంది. వారణాసిని దర్శించినంత మాత్రంచేతనే తులాపురుష దానంచేసిన ఫలం లభ్యం కాగలదు. కాశీని గురించి మనస్సులో సంస్మరణ చేసినందువల్లనే వందల మైళ్ళ దూరంలోఉన్న నరుని పాపాలుకూడ నశింపగలవు. కాశీ నగర సంక్రోశ సమీపానికి అడుగుపెట్టిన మాత్రంచేత పంచమహా పాతకాలు అయినా నశింపగలవు. బహుకాలం కాశీలో నివసించి కాలాంతరంవలన మరో ప్రదేశానికేగి దైవవశాత్తు మరణించిన వారికి కాశీయందు మరణిస్తే కలిగే ఫలమే కలుగుతుంది. అవిముక్త క్షేత్రంలో నివసించినవారి కర్మ బంధనాలన్నీ వాటంతట తెగిపోగలవు. మణికర్ణికా ఘట్టంలో స్నానం చేసి పితరులకు తిలతర్పణం చేసినవారికి యజ్ఞం చేసిన ఫలితం కలుగుతుంది. చక్రపు తీర్థంలో స్నానమాడి మౌనవ్రతుడై విశ్వేశ్వర దర్శనంచేసినట్లైతే మహాత్ములు సమస్త వ్రతాలుచేసినఫలంపొందుతారు. కాశీ క్షేత్రంలో ఒక్క దినమునకి శాస్త్రోక్తవిధిని నిత్య నైమిత్తిక కర్మలాచరించి విశ్వనాథుని అర్చించిన మనుజులకి యావజ్జీవితం శివార్చన ఆచరించినంత పుణ్యం లభిస్తుంది. వారణాసియందు త్యాగం చేసిన మనుజులు అనేక జన్మలలో నిర్విఘ్నంగా యోగసాధన మొనర్చినంత ఫలితం దక్కుతుంది. కనుక మానవుడు శరీరమస్థిరమని విచారించి ఆమరణ పర్యంతం కాశీలో నివాసం చేయవలె సుమా! చతుస్సముద్ర వలయితమైన ఈ భూమియందు కాశీ స్వర్గ ప్రదేశం. సమస్త ఐశ్వర్యాలకు కాణాచి. నరుడెంతటి పాపియైనా వారణాసికి వచ్చి అయిదు క్రోసుల మేరలోని స్థలంలో మరణించినవాడు కృతాంతుని మహిషకంఠ ఘంటా నినాదం వినడు.

అదిగాక మరొక్క విశేషం విను. పూర్వం శశిరథుడనే

చక్రవర్తి భూమిని పాలించాడు. ఆతను సగర చక్రవర్తికి ముమ్మనుమడు. సగరుని కుమారులు యాగాశ్వం తీసుకురావటానికి పాతాళానికి వెళ్ళి అక్కడ తపస్సు చేసుకుంటున్న కపిల మహాముని దుర్వారదృగగ్నిజ్వాలలలో భస్మమయినారు. తన పితరులకు పుణ్యలోకాలు కల్గించటానికి భగీరథుడు ఉగ్రమైన తపస్సు చేశాడు. ఆ తపః ప్రభావంవల్ల మందాకిని స్వర్గలోకం నుండి భూమికివచ్చి ఈ మణికర్ణికా ఘట్టంమీదుగా ప్రవహించింది. అది మొదలీ తీర్థంయొక్క మాహాత్మ్యం పేరు మరింత పెరిగింది. సురలకైనా దాని గొప్పతనాన్ని వర్ణించటానికి అలవిగాదు.

సాంగ చతుర్వేద అధ్యయనంకూడా భాగీరథీ స్నానంతో సరిగాదు. మనోవాక్కాయ కర్మల పాపం గంగాస్నానం హరించగలదు. జాహ్నవీస్నానం బ్రహ్మజ్ఞాన సంసిద్ధికి కారణం. కలియుగంలోని కలుష మానసులకు, నియమరహితులకు పరద్రవ్య అపహర్తలకు గంగాస్నానమే ప్రాయశ్చిత్తం. నీలకంఠుని కృపలేకుండా గంగాస్నానం సిద్ధించదు. కృతయుగంలో అన్ని తీర్థాలు పుణ్యప్రదాలే. త్రేతా ద్వాపరములలో కురుక్షేత్రం, గంగానది తీర్థములుగా బ్రహ్మచే ఏర్పాటు చేయబడినాయి. కృతయుగంలో ధ్యానం, త్రేతాయుగంలో తపస్సు, ద్వాపర యుగంలో యజ్ఞం కలియుగంలో గంగా స్నానం ఇష్టార్థికి సాధనాలు. పూర్వజన్మ సంస్కారం పరమేశ్వరుని అనుగ్రహం లేకపోతే నాకపురోప్రాంత ప్రవాహమై పాప విధ్వంసినిగా విఖ్యాతికెక్కిన గంగానదిలో స్నానం చేసే భాగ్యం కలగదు. ఈ మహాశ్చర్యకరం ఎల్లెడలా ప్రవహించే జాహ్నవీ తోయాలలో స్నానమాచరించినవారికి అఘాలు ఎన్నటికీ కలుగవు. దుర్నిమిత్తములు తోచవు. దుష్కీర్తి కలుగదు. వారి మహాపాపాలు నశించి అభీష్టార్థాలు సమకూరగలవు. గంగానదిలో తీర్థమాడి మహా

విడిచినారు. వారికి తెలియకుండా లోపలికి పోవటానికి ఎవ్వరికీ శక్తి లేదు. ఈశ్వరుని ఆజ్ఞ లేకపోతే కాశీ పట్టణంలోనికి పోవటానికి ఎవ్వరికీ వీలుగాదు. ఈవిషయం తెలిపే ఒక చిన్నకథ చెబుతాను విను.



పూర్వం ధనంజయుడనే పేరుగల వైశ్యుడుండేవాడు. అతను మాతృ సేవాపరాయణుడు. తల్లినే దైవంగా భావించి పూజించేవాడు. కొంతకాలానికి అతని తల్లి మరణించింది. ఆమెకి అపరక్రియలు నిర్వర్తించిన తరువాత ధనంజయుడు కాశీయందలి గంగాప్రవాహంలో తల్లి అస్థికలు నిమజ్జనం చేయాలని సంకల్పించాడు. అస్థికలను భద్రంగా తీసినాడు. వాటిని పంచగవ్యంతో తడిపి పంచామృతములతో పవిత్ర మొనర్చాడు. పుష్పాలతో పూజించాడు. అస్థికలను పట్టువస్త్రంలో చుట్టి ఆ మూటనొక తిత్తిలో పెట్టి దానిపై కంబళమును చుట్టినాడు. పైన మూర్ధగా మన్ను అద్దినాడు. దానిని భద్రంగా ఒక రాగి పెట్టెలోనుంచి తాళంవేశాడు. అస్థికల పేటికను తీసుకొని కాశీ పయనమైనాడు. మార్గంలో నియమంగా హవిష్యాశనం చేసేవాడు. నేలమీదనే పడుకొనేవాడు. నిష్ఠగా ఉంటూ ప్రయాణం చేస్తున్న ధనంజయునికి దారిలో జ్వరం సోకింది. రుగ్మతను సైతం లెక్కచేయకుండా ఒక ఆటవికుని కూలికి మాట్లాడుకొని తిన్నగా కాశీ పట్టణం చేరుకొన్నాడు. వారిద్దరూ ఒక వర్తకుని ఇంటిలో విడిదిగా దిగినారు. బోయవానినక్కడ కావలా ఉంచి తిండి మొదలైనవి తీసుకొనిరావటానికి బజారుకు వెళ్ళాడు.

వెంటవచ్చిన అటవికుడు రాగిపెట్టెలో ధనమున్నదని భావించి దురాలోచన పరుడై వర్తకుడు తిరిగి వచ్చేలోపల ఆ పెట్టెను తీసుకొని వెళ్ళిపోయినాడు. ధనంజయుడు తిండి తీర్థం మొదలగు కావలసిన పదార్థాలు సమకూర్చుకొని ఇంటికి వచ్చి మార్గాయాసంచేత విశ్రాం

డాడు. కొంత ప్రొద్దుకు నిద్రలేచి చెంబును కేకవేశాడు. ఎంతకూ బదులు సమాధానం రాకపోవటంతో తత్తరపడి గృహప్రాంగణం అంతా వెదకినాడు. చెంబు కనబడలేదు. వర్తకునికి ఆరాటం ఎక్కువయింది. భీతి కలిగింది. అతనికేమీ తోచలేదు. రాగిపెట్టె కనపడక పోవటంతో అతనికి దుఃఖం ముంచుకువచ్చింది. తల్లిని, తనుపడ్డ ప్రయాసను తలచుకొని దుఃఖించాడు. హృదయం వికలమయింది. ఆందోళనతో సతమతమవుతున్న ధనంజయునికి గంగానదిలో స్నానం చెయ్యటానికి గాని, పావన భాగీరథీ జలంతో విశ్వేశ్వరుని అభిషేకించాలనిగాని ఆలోచనే రాలేదు. దుంఠివిఘ్నేశ్వరుని చూడవలెననే తలంపు రాలేదు. కాలభైరవుని కొల్వవలెననే భావనలేదు. విశాలాక్షీదేవికి నమస్కరించాలని ఊహ కలుగలేదు. తెచ్చిన వంతారాలను పారవైచినాడు. అయ్యో! ఎంత కష్టం తరించి కాశీకి వచ్చాను. అస్థికలు నిమజ్జనం చేయలేక పోతినే అని వాపోయాడు. దుఃఖంతోనే చెంబుకొరకు బయలుదేరాడు. ఆకలి దహించివేస్తున్నా లెక్కచేయలేదు. మార్గమధ్యంలో దప్పిక కలిగింది. నీరు దొరకలేదు. నీరసం కలిగి తూలుతున్నాడు. ఎలాగో కాళ్ళీడ్చుకొంటూ, అటవికుని పల్లెకు చేరాడు. చెంబు గృహానికి వెళ్ళి వానిని, వాని భార్యను బ్రతిమలాడాడు పెట్టె తెచ్చి ఇమ్మని. ఈ విషయమై ఏ విధమయిన ప్రతిక్రియ చేయనని చెప్పి ప్రార్థించాడు.

దినానికి చెంబు స్వార్థంతో ఆ పెట్టెలో ధనముందని అపోహపడి తీసుకువచ్చాడు. అరణ్యంలో ఒక చెట్టుక్రింద పెట్టెను పగులగొట్టి చూచాడు. అందులో ధనం కనిపించలేదు. ఎముకలను చూచి అసహ్యించుకొని వాటి నక్కడే పారవేసి ఇంటికి వచ్చాడు. ఈ విషయమే ధనంజయునికి చెప్పాడు. వర్తకుడు అతనిని బ్రతిమలాడి

తనకా ప్రదేశం చూపిస్తున్నారు. వారి కాళ్ళంటి ప్రాధేయపడ్డారు. అటువిటువిరికూడ వర్తకుని మీద జాలికలిగింది. ధనంజయుని తీసుకొని ఎముకలు పారవేసిన స్థలానికి తీసుకువెళ్ళినారు. అదేమి మాయోగాని అరణ్యంలో అస్థికలు పడవైచిన చోటు కనిపించలేదు. ఎంతకీ ఆ ప్రదేశం గుర్తు తెలియలేదు. శ్రమచెంది అక్కడనే తిరిగినారు. కాని ఎముకలు కనబడలేదు. హతాశుడయిన ధనంజయుడు దుఃఖించి, దుఃఖించి మరల కాశీకి చేరాడు. ఎలాగో గంగాస్నానం చేసి ఇంటికి వెళ్ళాడు. కనుక విశ్వేశ్వరుని ఆజ్ఞ లేక కాశిలో ఏకాగ్ర్యమూ పోగదు.

ఈ విధంగా కుమారస్వామి కాశీ, గంగా మాహాత్మ్యములను వర్ణించి మైత్రావరుణీ! ఇంక కాలభైరవుని చరిత్రను వినిపిస్తాను శ్రద్ధగా వినవలసిందన్నారు.

## కాలభై వజననం

ప్రళయ కాలంలో సముద్రాలలోని నీటిని, నదీనదాలలోని నీటిని ఆపోశిస్తూ కాళరాత్రి రెండు హస్తాలతో వేస్తున్న తాళగతి ప్రకారం మహా భయంకరంగా భైరవుడు తాండవం చేస్తుంటాడు. ఇది మహాద్భుతమైన కథ.

ఒకప్పుడు బ్రహ్మ మేరు పర్వతంమీద కొలువు తీర్చాడు. ఆ సభలో సమస్త దేవతా సమూహం తమతమ ఆసనాల అలంకరించింది. అనేక విషయాలపై చర్చలు వాదోపవాదాలు జరిగాయి. అనంతరం సభ నలంకరించిన మునీశ్వరులలో కొందరు వినయంతో నమస్కరించి వాగ్వధూ వల్లభా! మాకొక సంశయం ఉంది. ముల్లోకాలలోని మహాత్ము లందరూ చేరిన సభయిది. అవ్యయమైన తత్వమేదో వివరించవలసింది-

అని ప్రశ్నించారు.

ఆ మాటలకు ధాత మునీశ్వరులారా! మహామాయ ప్రభావంవల్ల నాకే సందేహం కలిగింది. ఈ చరాచర సృష్టికంతటికీ నేనే అధీశుడను. నా కధీశ్వరుడు మరొకడు లేడు. కనుక నన్నే అవ్యయమైన పరతత్త్వమని సేవించండి అన్నాడు.

ఆ మాటలకు యజ్ఞ పురుషుడైన పుండరీకాక్షుడు క్రోధ తామ్రాక్షుడయినాడు. ఓయీ చతుర్ముఖా! పరతత్త్వమేదో తెలియక మునులకు మూఢులకు నీవే పరతత్త్వాన్నని పలికావు. నేను శ్రీమన్నారాయణుడను జగత్తుకు ప్రభువును అవ్యయ కర్తావికి అర్హుడనుగాని నీవుగాదు. దురహంకారంతో ఇష్టం వచ్చినట్లు పలుకకుమని విష్ణువన్నాడు. కమలగర్భుడు రెచ్చిపోయినాడు. ఇద్దరూ వాగ్యుద్ధానికి తలపడ్డారు. తమలో తాము తేల్చలేక పరతత్త్వాన్నిగూర్చి నిర్ధారణ చేయవలసిందని వేదాలను ప్రశ్నించారు.

ఋగ్వేదం మీ ఇద్దరిలో ఎవ్వరూ పరతత్త్వం కాదు. ఆది దేవుడు అనామయుడైన రుద్రుడే పరతత్త్వం. భూత గణాలన్నిటిని ఆతడే సంహరిస్తాడు. సనాతనమైన మాయను ప్రపంచం అంతా చింతింప చేసినవాడు కూడ ఆతడే. వేద ఉపనిషత్తులనే హంస్య పీఠంలో విహరించేవాడు సదాశివుడే. శంకరుడే చింతన కందనివాడు. ఆతడే అద్భుతుడు, అరూపుడు అని విస్పష్టముగ పలికింది.

యజుర్వేదం ఈ విధంగా చెప్పింది. సకల యాగక్రియల వలన పరమేశ్వరుడు పూజనీయుడైనాడు. ఆధ్యాత్మిక రహస్యమార్గాల తప్ప ఆయనను దర్శించటానికి వీలులేదు. చతుర్వేదముల ప్రామాణ్యమున కారణమైనవాడు చంద్రమౌళీశ్వరుడే. కూటస్థుడయి తాను కర్మల సమస్త విశ్వాంతరాళంలో జరిగేది చూడగల్గినవాడు నిలిచియుండే. అట్టి

అయినా వనజనేత్రుడు సరసిజగర్భుడు అజ్ఞాన తిమిరావృతులై ఆ పలుకులను లెక్క చేయలేదు. తమ గర్వాన్ని వీడలేదు.

అదే సమయంలో వారి నడుమ అనంతమైన దివ్యతేజం ఒకటి ఉద్భవించింది. కోటి సూర్యప్రభాసమానమైన ఆ తేజస్సునుంచి ప్రళయ సమయ సంధ్యామహా భయంకరమైన డమరుకా నినాదం భూనభోంతరాళం ప్రతిధ్వనిస్తుండగా, వికటపాదం జటావిరాజితుడైన హరుడు ప్రాదుర్భవించాడు. ఆహా! ఏమి ఆ రూపం. కటి ప్రదేశంలో గంధేభ చర్మం. విస్ఫులింగాలు వర్షింపచేస్తూ మెడలో నాగాభరణంవలె ఫణిరాజు ప్రకాశిస్తున్నాడు. వంపటి హస్తంలో జ్వాలాజ్వాలల కింద ఎగజిమ్ముతూ త్రిశూలం వెలుగుతున్నది. శేఖ జటాజూటంలో శీతచంద్రుడు సాంద్ర చంద్రికలు కురుస్తున్నాడు. అనిర్వచనీయమైన ఆ స్వరూపంనుంచి వెలువడుతున్న శ్వేతకాంతులను దర్శించలేక దేవతలు కన్నులు మూసుకొన్నారు. విస్తృతమైన విరూపాక్షుని చూచికూడ విరించి అహంకారంతో డమరుకధరా! నీవు ఒకప్పుడు నా లలాటంనుంచి జనించావు. ఆ సమయంలో నీవు ఉచ్చైస్స్వరంతో రోదించావు. ఆ కారణంచేత నీకు రుద్రుడనే పేరు నేనే కల్పించాను. ఈ సందర్భంవల్ల నీవు నాకు పుత్రుడవు. ఇప్పటికయినా నన్ను శరణువేడి రక్షణ పొందు అని తన ఐదవ ముఖంద్వారా పలికాడు. విధాత్రి గర్వానికి సదాశివుడు నిజంగా రుద్రుడయినాడు. రోష సంరంభంతో విజృంభించాడు.

భూమి కంపించింది. దిక్కులు వణికాయి. గ్రహతారకల గతులు తప్పిపోయాయి. శతకోటి అశనిపాత ధ్వానం భయంకరంగా వినవచ్చింది. కాలకంఠకంఠకాలకూటచ్ఛవి సూర్యబింబాన్ని కప్పివైచింది. శశిశేఖరుడు ఫాలలోచనం తెరిచాడు. విస్ఫులింగాలు వెళ్ళగక్కుతూ హరుని నేత్రాగ్ని

జ్వాలలు ఆ ప్రళయసముద్రంలో లేచిపడుతున్నాయి. ప్రళయసంహారకుడైన రోషవిస్ఫురణతో నిమిష మాత్రాన విశ్వసంహారం చేయసంకల్పించాడు. వేల్పులు పారిపోవ సాగారు. ఆ సమయంలో భయంకరాకార సముదగ్రతేజులతో దర్శనీయుడైన కాలభైరవుడు అవతరించాడు. కాలభైరవుడు త్రినేత్రునకు నమస్కరించి ఏమి యాజ్ఞ అనినాడు. దురహంకారంతో దురాలాపాలాడిన బ్రహ్మ పంచమ శిరమును ఖండించు మనినాడు విరూపాక్షుడు. దిక్కులు దద్దరిల్లేటట్లు హుంకారరావం చేస్తూ కాలభైరవుడు కాలునివలె గోచరించాడు. అడుగు ముందుకువేసి మదపుటేనుగు కమలాన్ని పెరికివేసినట్లు గోటితో నరపేషి పంచమ శిరస్సును త్రుంచివేశాడు. శరీరంలోని అంగమొకటి చెడిపోతే దాన్ని ఖండించివేసి శరీరాన్ని కాపాడవలె. అది న్యాయం. ఆ ధర్మాన్ని పాటించి కాలభైరవుడు శాంతించాడు.

ఈ అకాల వైపరీత్యానికి దేవతలంతా కంపించిపోయారు. కమలగర్భుడు కొంతసేపు విశ్చేష్టుడయినాడు. కాలభైరవుని దర్శనంతో అతని శరీరం వణకసాగింది. దిక్కుతెలియక నాలుగు ముఖాలతో శతరుద్రీయం పారాయణం చేయనారంభించాడు. అంతకుముందే నారాయణుడు మహేశ్వర స్తోత్రం శ్వేతాశ్వతరోపనిషత్తు పఠనం చేయసాగాడు. వారి స్తోత్రాలు విన్న రుద్రుడు మరల శివస్వభావంతో గోచరించాడు. అతడు లోకశంకరుడు, శరణాగత వత్సలుడు గదా! బ్రహ్మ, విష్ణువులను కృపాదృష్టితో మన్నించాడు. వికృతాకారమయిన భైరవుని పిలిచి కుమారా! ఈ యజ్ఞపురుష వికారాలు నీకు పూజనీయులు. వీరిపై క్రోధం ఉపసంహరించు. ఈ పంచమశిరం నీ చేతికంటి ఉంది. దానితో భిక్షాటన కావించు. కాపాలికా వ్రతంతో లోకంలో సంచరించు అని చెప్పి బ్రహ్మ

హత్యను సృష్టింప సంకల్పించాడు. మరుక్షణంలో వికృతాకారంతో బ్రహ్మ హత్య జనించింది.

మోకాళ్ళ దిగని ఎఱ్ఱని వస్త్రం. రక్తరంజితమైన వికృత దేహం. పింగళవర్ణంతోకూడిన తారకంతో కూడిన మిడిగ్రుడ్లు. ఎఱ్ఱని కేశాలు. వాటిలో తురిమిన జపాకుసుమాలు. తీక్ష్ణమైన కోరలు భయంకరంగావున్న నోటిలో నుండి బయటకు తొంగిచూస్తూ భీతి కలిగిస్తున్నాయి. కరాళజిహ్వ ఒడలు గగుర్పాటు కలిగిస్తున్నది. మహోగ్ర రూపంతున్న బ్రహ్మహత్యను చూచి మృత్యుంజయుడు కాశీ క్షేత్రంతప్ప త్రిలోకాలలో అన్ని ప్రదేశాలు నీకు ప్రవేశానికి అర్హాలే. నీవు భైరవుని వెంట తిరుగుతుండ వలసిందని ఆజ్ఞాపించి దేవతల నమస్కారాలు స్వీక రించి అదృశ్యమైనాడు. దేవతలు తమతమ లోకాలకు చేరారు.

తదనంతరం కాలభైరవుడు తన వెంట బ్రహ్మహత్యరాగా ముల్లో కాలు తిరుగుతూ ఒకనాడు వైకుంఠం చేరాడు. ఆ సమయంలో పద్మా క్షుడు పద్మాలయతో సరససల్లాపాలు ఆడుతున్నాడు. నారాయణుడు భైరవుని రాకవిని సతీసమేతుడయి వచ్చి స్వాగతం పలికాడు. అగ్నిజ్వాల లు వెలిగ్రక్కుతూ ఫాలనేత్రవిరాజితుడై బ్రహ్మకపాలహస్తుడై భీకరాకా రంతోవున్న కాలభైరవునిచూచి విష్ణువు నమస్కరించాడు. పతిపైన లక్ష్మితో ఇందిరా! చూచావా ఈ మహాపురుషుని. సకలయోగీశ్వరులు మహాతత్వమని పొగడే మహనీయుడు ఇతడే. సమస్త భూతకోటికి ఆధారమయిన పరమేశ్వరునకు ఇతనికి భేదంలేదు. హాలాహలమును కంఠమునిలిపి లోకాలను కాచిన పరమేశ్వరుడితడే సుమా! అని వివరించి అనేక విధాల స్తోత్రం చేశాడు. అతని దీనావస్థ వృత్తాంతం తెలిసి లక్ష్మికి సంజ్ఞ చేశాడు. ఆ తల్లి ప్రఫుల్ల వదనంతో లోపలికెళ్ళి భిక్షనిడుటకుగాను

భక్తి తాత్పర్యాలతో అమృతమయమైన పదార్థాలను భిక్షగా ఒసగింది. ఆ దంపతుల సత్కారాలను ఆనందించి భైరవుడు మరల సంచారానికి బయలుదేరాడు. తిరిగి తిరిగి ఒకనాడు కాశీ నగరప్రాంతానికి వచ్చాడు. అక్కడికి రాగానే అతని మనస్సు హర్షపులకితమైంది. అది సకల పాపాలను హరించే పుణ్యభూమి. కాశీవిశాలాక్షితో కూడి పరమశివుడు నివసించే చోటుగదా అది. భాగీరథీ నదీవాహావారి పరిపూతమైన కాశిలో భైరవుడు అడుగిడినాడు.

కాలభైరవుడు ఆ మహా శ్మశానంలో కాలు పెట్టటంతోనే బ్రహ్మాండం బ్రద్దలుచేసే అంతటిధ్వని కలిగింది. భైరవుడు వెనుదిరిగి చూశాడు. కాశీ లహర్యాగాన హాహాకారం చేస్తూ వెంటపెట్టుకొన్న బ్రహ్మహత్య పాతాళంలో పడింది. మరుక్షణంలో అతని చేతనున్న కపాలం భూమిపై పడింది. మహోత్సాహంలో ఆ వటుకనాథుడు గంగలో స్నానమొనర్చి ఆనందవనంలో స్థిరంగా ఉండిపోయినాడు. కపాలం భూమిపై పడిన చోటుకు కపాలమోచన తీర్థమనే పేరు కల్గింది. సర్వజనుల పాపాలు నశింపచేసే వాడుకనుకనే పాపభక్షకుడని, కలుషమర్దనుడని నామములు కలిగాయి. కాలరూపుడు కావటంవల్ల కాలభైరవుడైనాడు, కాలనాథుడని పిలువబడినాడు. భీషణ భైరవుడు కావటంచేత భీషణుడని పేరు కల్గింది. సేవచేసేవారికి అతడు సామ్రాజ్య సిద్ధికరుడు. క్రోధభైరవుడు కాశీని పెద్దతలారి. వారణాసికి అయిదు క్రోసులమేర భూమిని కాచియుంటాడు. కాలభైరవ అనువారి గాథను విన్నవారి మహాపాపాలు నశించటమేగాక సకల కోరికలు తీరుతాయి.

కాలభైరవుని కథవిన్న అగస్త్య దంపతులు సంతోషంతో పులకించారు. అగస్త్యుడు మళ్ళీ అన్నాడు। ఇంతటి అద్భుతగాథను విన

రించినందుకు నా ప్రణామములు, హరికేశుడనే యక్షుడు మహాదేవునకు అత్యంత సన్నిహితుడని, ప్రమథగణాలకు దండనాయకుడని విన్నాను. అతని చరిత్ర వినటానికి నాకెంతో కుతూహలంగా ఉంది. అనగానే కుమారస్వామి హరికేశుని కథ ఇలా వివరించాడు.

## హరికేశుని వృత్తాంతం

గంధమాదన పర్వత ప్రాంతంలో రత్నభద్రుడని యక్షుడొక డున్నాడు. అతని కుమారుడు పూర్ణభద్రుడు. పూర్ణభద్రుడు కనక కుండల అనే కాంతను వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు హరికేశుడని పుత్రుడు జన్మించాడు. దినదిన ప్రవర్ధమానుడగుతున్న హరికేశుని హృదయంలో మహేశ్వరునిపై భక్తి నానాటికీ గాఢంగా పెంపొందింది. వారణాసి మాహాత్మ్యం విన్న హరికేశుడు అచట తపస్సు చేయవలెనని సంకల్పించాడు. తల్లిదండ్రుల అనుజ్ఞపొంది ఆనంద కాననమున కేగినాడు. నిశ్చలమైన భక్తితో తపస్సు ప్రారంభించాడు. అతనిచుట్టూ పుట్టలు పెరిగినాయి. ఒకనాడు పరమేశ్వరుడు లీలావిలాసంగా అచ్చటికొచ్చాడు. వెంట పార్వతీదేవికూడ ఉన్నది. నిర్మల తపోనిష్ఠలో ఉన్న హరికేశునిచూచి పరమేశ్వరుడు ఆనందభరితుడయినాడు. అతడు కోరిన వరాలు దయచేశాడు. అంతటితోనేక అతనికి దండనాయక పదవి ఒసంగాడు. నాటినుంచి హరికేశుడు కాశియందు సంరక్షకుడుగా ఉన్నాడు.

వెండికట్లు కలిగిన దండంతో హరికేశుడు కాశీపట్టణ ప్రాకార గోపుర ప్రాంత ప్రదేశాలలో విహరిస్తుంటాడు. తప్తమైన అరుణ చ్ఛాయలతో నిలిపిల్లే జడలు, కంకణములతో కుండలాలతో పాలించు ఫాలమున విభూతి పుండ్రములతో ఉచ్చారణాయుక్తములైన పొమ్మయానుష్ఠా

జ్ఞానోదము, బ్రహ్మజ్ఞానము, శివతీర్థము, జ్ఞానతీర్థము, జ్ఞానవాపిక అనే పేర్లతో పిలువబడుతున్నది. ఈ తీర్థంలోని జలాన్ని పానం చేసినా, తాకినా, సంకీర్తనం చేసినా, చూసినా, సప్త మహాయజ్ఞాలు చేసిన ఫలం సిద్ధిస్తుంది. ఈ తీర్థం కైవల్యం ప్రసాదిస్తుంది. బ్రహ్మరాక్షస, పిశాచ, శాకినీ గ్రహ కూశ్మాండాదిని ఈ జ్ఞానకుండికకు ఏర్పరచి మహేశ్వరుడంత ర్హితు డైనాడు. ఈ శివతీర్థ మహిమ ఇంత అని చెప్పరాదు.

పూర్వం కాశీనగరంలో హరిస్వామి అనే బ్రాహ్మణుడు నివసిస్తుండే వాడు. అతనికి సుశీల అనే కుమార్తె ఉండేది. ఆమె చాల అంద గత్తె. ముల్లోకాలలో అంతటి సౌందర్యవతి లేదని పొగడబడుతూ ఉండేది. చిన్న వయస్సునుండి ఆమె పరమశివుని దైవంగా కొలిచేది. నిత్యం పెందలకడ నిద్రలేచి పంకజదీర్ఘికలో స్నానం చేసేది. నిత్య కృత్యంగా ఆమె శివాగారానికి వెళ్ళి స్వామిని అర్చించి తిరిగి యింటికి వచ్చేదది. వెంట చెలికత్తెలు ఉండేవారు. ఆలయానికి వెళ్ళి వచ్చే టప్పుడు పౌరులు ఆమెనుచూచి అయారె ! ఈమె అందం. ఈ వనితనుపొందని వాని జన్మ ఎందుకు అని ఉవ్విళ్ళూరుతుండేవారు. ఆమె విశ్వనాథుని కల్యాణవేదియందు రంగవల్లులు తీరుస్తుంటే భూలోకానికి దిగి వచ్చిన లక్ష్మీదేవి యేమో అన్నట్లు కనుపించేది. ఆమె కంఠంమీది మూడు రేఖలు చూడగానే మూడులోకాలలో ఆమెసాటి అనదగిన అంద గత్తె లేదని విధాత లిఖించిన గీతలా అన్నట్లుండేవి! అగస్త్యమహర్షీ! జ్ఞానవాపిక తీర్థసేవ చేసిన ఫలితంగా ఆమె గర్భంలో మూడు దివ్యలింగ ములు విరాజిల్లినవి. కేదార క్షేత్రం కాశీలోని శివక్షేత్రంలోని జలం లింగరూపం దాల్చగలదని పెద్దలంటారు.

ఇలా ఉండగా ఒకనాడొక విద్యాధరుడు సుశీల రూపలావణ్యాలుచూచి

మోహితు డయినాడు. ఒకనాటి రాత్రి మంచం మీంచి జారిపోయినట్లు వెన్నెలలో విహరించింది. విద్యాధరుడు తన మాయా ప్రభావంతో నిద్ర పోతున్న ఆ బాలికను నిద్రాభంగం కాకుండా అతి సుకుమారంగా ఎత్తుకొని ఆకాశమార్గాన మలయపర్వత ప్రాంతానికి ప్రయాణం సాగించాడు. త్రోవలో ఆమె కన్నులుతెరచి చూచి భయకంపితురాలయింది. కాని విద్యాధరుని అందచందాలకు ఆమెకూడా మన్మధబాణాలకు గురయింది. మలయ పర్వత సమీపంలో విద్యున్మాలి అనే రాక్షసుడు నివసిస్తున్నాడు. అతడా చదురు ఆమె సౌందర్యానికి మోహితు డయినాడు. మదనావేశంతో ఆమెను బలవంతంగా లాగుకొని పోవటానికి ప్రయత్నించాడు. విద్యాధరుడు రాక్షసుని ప్రయత్నం చూచి ఆమెను ఒక సురక్షిత ప్రదేశంలో ఉంచి రోషావేశంతో రక్కసునితో తలపడినాడు. వా రిద్దరు ఒకరికొకరు తీసిపోక పోరాడుతున్నారు. చివరకు ఒకరి ఆయుధము మరొకరికి తగిలి ఇద్దరూ ఒకే సమయంలో మరణించారు.

ప్రాణంపోయే సమయంలో విద్యాధరుడు సుశీలనుచూచి అయ్యో! నిన్ను .... అని ఏమో చెప్పబోయి పై మాటలు రాకుండానే మరణించాడు. సుశీల దుఃఖానికి అంతులేదు. ఏమిచేయవలెనో తోచలేదు. మనసులో ఎన్నో భావనలు రేగాయి. ఇతడు నన్ను ఆలింగనం చేసుకొన్నాడు. అధరము చుంబించినాడు. శరీరము ఇతనిచే స్పృశింపబడింది. ఇక భర్త అనగా ఎవరు? శాస్త్రప్రకారం ఇతడే నా భర్త. నే నతని భార్యనయి నాను. భర్తతో సహగమనం చేసిన వనిత స్వర్గసౌఖ్య మనుభవిస్తుందని శాస్త్రములు చాటుతున్నాయి కనుక నే నతనితో సహగమనం చేసి మరణిస్తాను అని మరల ఆలోచనచేసి చుట్టుపక్కల గంధపు కర్రలను ప్రోగుచేసింది. అగ్ని రగుల్కొలిపి, మనస్సున కాశివిశ్వనాథుని స్మరించి

మనసులో ఇలా విచారించింది.

విశ్వనాథస్వామికి నేనేమి అపచారం చేశాను. వారణాసిలో తల్లి దండ్రుల ఇంట క్షేమంగా ఉండవలసిన నాకు ఈ దుస్థితి సంభవించింది. జ్ఞానవాపికలో స్నానమాడి బయలుదేరిన నా చెలికత్తెలు నన్ను తలచు కుంటారా? నే నేమైనది తెలియక తల్లిదండ్రులు నా కోసం ఎంతగా దుఃఖిస్తుంటారో! చిలకపిల్లలను పెంచుతున్నానుగదా రేపటినుండి వాటి నెవరు ఆదరంతో చూస్తారు. నా సేవ కాశీశ్వరునికి రుచించలేదో. లోలార్కా! కేశవా! దుంఢివిఘ్నేశ్వరా! మరల జన్మగలిగితే మిమ్ము దర్శి స్తాను. వివాహానంతరం జీవితం గడపలేను సుమా! మహాకవిని వివాహం ఆడలేను. ఇతడే నా భర్త. ఇతనితోనే స్వర్గానికి పోతాను. ఇంక ఆలస్యం చేసితినా ఈ కీకారణ్య మధ్యంలో ఎవరయినా నాకు అపచ కలి గించవచ్చు. లేకపోతే సింహశార్దూలాది క్రూరమృగాలు నన్ను హింసిస్తాయేమో. ఈ విద్యాధరుడు నన్నెంతగానో ప్రేమించి ఇచ్చటికి తెచ్చి నాకుగా మృతుడయినాడు. ఈ వార్తవిని ఇతని తల్లిదండ్రు లెంత దుఃఖిస్తారో అని వసంతకాలంలో కోడుమకోయిల క్రోశించినట్లుగా పెద్ద పెట్టున ఏడవసాగింది. చివరకు పినాకహస్తునికి ప్రదక్షిణంచేసి నమస్క రించి మనస్సులో ఆనందకాననంలోని నా పుట్టినిల్లు అభివృద్ధి చెందుగాక. నా జనయిత్రి ప్రియంవద చిరకాలం విధవకాని వర్ధిల్లుగాక. నా బంధు వర్గం ప్రవృద్ధి పొందుగాక. నిత్య ప్రభాతమునందు జ్ఞానవాపికలో స్నానమొనర్చిన ఫలం, విశ్వేశ్వరస్వామి ముక్తిమంటపం ముంగిట చే తీర్చిన రంగవల్లుల ఫలం, ప్రతి చతుర్థిని విఘ్నేశ్వరుని అర్చించిన ఫలం సర్వంటూచి ముందటి జన్మలో నాకు ఈ విద్యాధరుడే భర్త యగునట్లు చేయుగాక అని తలంచుకొని సతీ అగ్నిప్రవేశం చేసింది.

కళావతీ వృత్తాంతం విని అగస్త్యుడు ఆనందపరవశుడయ్యాడు. కుమారుడితో స్వామీ! సదాచారమంటేమి అది విశదీకరించ వలసిందని ప్రార్థించాడు.

అందుకు కుమారస్వామి కలశసంభవా! మనువు పరాశరుడు మొదలయిన మహాత్ములు వివరించిన మతాలు అపారమయినవి. కనుక వాటి అన్నిటి సారం చెబుతాను విను అని ఇలా చెప్పాడు.

మానవుడు ఒక్క రాత్రికూడ ప్రమత్తుడుగాక సదాచారం నిర్వర్తించలేడు. మానవుడు ప్రమాదవశుడు కావటం లోక సహజం. ప్రమాదాలవల్ల కలిగే అనాచారాలకు శివధ్యానం చేయటంతప్ప మరో మార్గం లేదు. నాలుగు ఆశ్రమాలు నాలుగు వర్ణాలుంటాయి. ఇందులో మొదటి మూడు ధర్మాలను పోషిస్తాయి. నాలుగవది జ్ఞానానికి ఆలవాలం.

బ్రాహ్మణులయినవారు బ్రాహ్మముహూర్తంలో నిద్రలేచి ఆచమనం చేయవలె. విభూతి రుద్రాక్షమాలికలు ధరించి పద్మాసనస్థులై ముందుగా గణపతిని ధ్యానించవలె. పిమ్మట పార్వతీ పరమేశ్వరులను, లక్ష్మీనారాయణులను, సరస్వతీ బ్రహ్మాదిదేవతలను ధ్యానం చేయవలె. అనంతరం దిక్పాలకులను, గంగాది పుణ్యతీర్థాలను, కాశీ మొదలయిన పుణ్యక్షేత్రాలను, వేదాది విద్యలను, మహా పురుషులను మనసులో స్మరించవలె. వీరంతా ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించవలెనని ప్రార్థన చేయవలె. అనంతరం నిత్యనైమిత్తికములయిన అనుష్ఠానములు తీర్చాలి.

ఈ విధంగా శౌచప్రకారం వివరించి షణ్ముఖుడు ఇలా అన్నారు. కొంతంత మృత్తికతోను, పవిత్రమయిన నీటితోను శుద్ధిచేసుకొన్నప్పటికీ, భావశౌచానికి బాహ్యశౌచం పనికిరాదు. అయితే శరీరానికి ఒనరించే

శౌచాలన్నీ అంతఃశుద్ధి కొరకేనమ్మా ! ద్విజాతివాళ్ళెప్పుడు తన మనస్సును ఎంతో నిర్మలంగా ఉంచుకోవాలి. మానసిక శుద్ధికి గాయత్రీజపం ముఖ్యమైన సాధనం. గాయత్రిని మూడుకాలాలలో జపిస్తే మనస్సు ధర్మం తప్పకుండా నిలుస్తుంది. పగలు నిలుచుండి రాత్రి కూర్చుండి గాయత్రీజపం చెయ్యాలి.

సంధ్యావందనం చేసినతర్వాత బ్రాహ్మణుడు దేవతర్పణంచేసి, ఋషి తర్పణం, పితృ తర్పణం చేసి వైశ్వదేవం చేయాలి. దానివల్ల దేవతలు తృప్తి చెందుతారు. శ్రద్ధతో బలిహరణం చేయాలి. తూర్పు దిశగాగాని, ఉత్తరపు దిశగాగాని కూర్చుండి భోజనం ఆహరించవలె. గంధాక్షతలతో అలంకృతుడై అభ్యవహారం ఇమ్మని ఆపోశనం పట్టి పంచ వాయువుల నామాలు ఉచ్చరిస్తూ ప్రాణాహుతులు పుచ్చుకోవాలి. దర్భముద్రికం చేతితోడనే భోజనం చేయవలె. కడుపులో గాలికి కొంచెం ఎడముంచి తినవలెగాని త్రేపొచ్చేటట్లు అందేటట్లు గొంతునిండుగ మెక్కరాదు. భోజనానంతరం మంచినీరుగాని, మజ్జిగగాని త్రాగవలె. 'అమృతాపిధానమసి' మంత్రంతో ఉత్తరాపోశనం పట్టడం చేసి, మూతి శుభ్రం చేసుకోవాలి. తిరిగి కేశవ నామముతో ఆచమనం చెయ్యాలి. అనంతరం తాంబూలం చర్వణం చేయవలె. అగస్త్యమహర్షీ ఇలా సదాచారం పాటించే గృహస్థాశ్రమం తక్కినవాటికంటే అధికమైనది. క్రమంగా గార్హస్థ్య ధర్మం నిర్వర్తించటానికి తగిన ఇల్లాలు లభ్యం కావలెనమ్మా! మహర్షీ! ఉత్తమ స్త్రీ లక్షణాలు వినుమని శరవణభవుడు కలశజునితో ఇలా అన్నారు.

పాదములు, వేళ్ళు, అంగుష్ఠములు, అంగుళి, నఖములు, మీగాళ్ళు గుల్ఫములు, పిక్కలు, జంఘలు, జానువులు, ఊరువులు, కటి నితంబ

ములు, నాభి, కుక్షి, పార్శ్వము, పదము, మడుకలు, (పక్కలు) వక్షో జములు, చూచుకములు. జత్రువు, స్కంధము, మణిబంధములు, ముంచేతులు, అరచేతులు, కంఠము, చిబుకము, హనువులు, కపాలము, వక్త్రము, ఉత్త రోష్ఠము జిహ్వ, తాలువులు, కన్నులు, కనురెప్పలు, భ్రుకుటి, లలాటం, శిరస్సు శాస్త్ర పద్ధతి ననుసరించిన ప్రమాణము కలిగిఉండవలె. అన్నింటిని మించి మంచి హృదయముతో విలసిల్లవలె. శారీరక లక్షణలోపం కల్గినా హృదయ లక్షణం తొలగరాదు. ఇన్ని లక్షణములు గల స్త్రీ భార్యఐతే గృహలక్ష్మి అని పిలువబడి గృహమేకాక వంశాన్నికూడా పావనం చేస్తుంది. ఇలాంటి గృహిణివల్ల పురుషుడు గార్హస్థ్యం సక్ర మంగా నిర్వర్తించి కృతార్థుడు కాగలడు. ఇన్నిపాట్లు పడేకంటే అగస్త్యమౌనీ కాశీయందు మరణిస్తేచాలు ముక్తి లభిస్తుంది.

శ్రద్ధగావిన్న అగస్త్యుడు మయూరవాహనా! జ్ఞాన కారణములయిన వాటిని వివరింప వలసిందని ప్రార్థింపగానే షణ్ముఖుడు సంతోషంతో వివరించాడు.

కుంభజా! వేదములలో చెప్పబడిన దానిని ఆచరించటమే యజ్ఞం చేయటం, బ్రహ్మచర్యాశ్రమం నిర్వర్తించితే తపస్సు చేసినట్లు అవు తుంది. దానివల్ల బాహ్యేంద్రియ జయం సిద్ధిస్తుంది. శ్రద్ధ ఉపవాసాలవల్ల అంతరింద్రియ నిగ్రహం కలుగుతుంది. ఇవన్నీ విజ్ఞాన కారణములే. వినదగినది, ఆలోచింపదగినది, చూడదగినది, అన్నియు కూడ ఆత్మయేనమా! ఆత్మావలోకనం చెయ్యటానికి యోగాభ్యాసమే ఉత్తమమైన సాధనం. సాంద్రమైన అరణ్యంలో, పర్వత గుహలలో నివసించటంవల్ల ఆత్మను తెలుసుకోలేరు. గ్రంథాలు పఠించినంతమాత్రాన సిద్ధించదు. దానములు, వ్రతములు, ధర్మములు, యాగములు చేసినందున ఆత్మజ్ఞానం లభించదు.

మనస్సు చివరకు దృష్టి కేంద్రీకరించిన మార్గాన యోగసిద్ధి కలుగదు. ఇతరమును వదలి విశ్వము ఆత్మ సంతుష్టుడయి ఆత్మచేతనే ఆత్మ నెరుంగవలె. అట్లు తెలుసుకొన్నవారే యోగసిద్ధిని పొందినవారు.

కొంతమంది ఆత్మ పరమాత్మల సంయోగమే యోగమంటారు. ప్రాణ అపానముల సమాగమమే యోగమని మరికొందరు వివరిస్తారు. కొందరు విషయేంద్రియాల కలయికనే యోగమని నిర్వచిస్తారు. పరమాత్మ క్షేత్రజ్ఞుల సంయోగమే యోగమని కొందరంటారు. యమ నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధులు యోగానికి అంగాలని బోధిస్తారు. నా మతంలో మాత్రం ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు ఆరే అంగములు.

ఇందులో ప్రథమంగా చెప్పిన ఆసనములు అనేక విధములు. స్వస్తికాసనము, గోముఖాసనము, పద్మాసనము, వీరాసనము, భద్రాసనము, మత్స్యాసనము, మయూరాసనము, మకరాసనము మొదలయినవి. ఇందులో ఏదయినా ఒక ఆసనస్థుడై కూర్చుండి యోగి అయినవాడు యోగాభ్యాసము చేయాలి. దోమలు, ఈగలు మొదలయిన కీటకాలు లేని ప్రదేశం ఎన్నుకోవాలి. కేశములు, భస్మం మొదలయినవి లేకుండ ఉండవలె. జన సంకులం కాకుండా ఏ బాధలు లేకుండా సుఖావహమైన ప్రదేశం ఎన్నుకోవాలి. అసంతుష్టుడు, క్షుధార్తుడు, నిద్రాక్రమితుడు కానప్పుడే యోగ సాధనము ఉపక్రమించాలి. పైపండ్లు క్రిందిపండ్లు ఒకచోట చేర్చరాదు.

గాలిని కుంభించి మెల్లమెల్లగా మరలించి ఉండవలె. ఒకేసారి బలవంతంగా గాలిని విడిచితే అది రోమకూపాలనుండి బయటకు రావటానికి ప్రయత్నిస్తుంది. దానివలన కుష్ఠు మొదలయిన రోగములు కలిగే

ప్రమాద ముంది. మరింతిక ఏమనగా మానవుడు మెల్లగా మ స్తరించి తంత మీదకున గురుపైకి ఎక్కినట్లు యోగసాధకుడు వాయువును క్రమంగా స్వాధీన పరచుకొని విలయం పొందాలి. సవ్యాప సవ్యాల ప్రయాణిస్తుంది కనుక గాలికి ప్రాణవాయువనే పేరు కల్గింది. సాధకుడు చంద్రనాడిద్వారా గాలిని పూరించి సూర్యనాడి నుండి విడుదల చేస్తారు.

---

సృష్టి అనంతమైనది. ఇందు గల జీవకోటిలో మానవునికి విశిష్టత ఉంది. ఆదికాలంలో మానవుడు ఆహారం కొరకు మొంత కాపశ్రయపడినాడు. వ్యవసాయం, గృహ నిర్మాణం మొదలైనవి చేసే స్థాయికి వచ్చినతర్వాత అతని దృష్టి సృష్టివైపుకు మళ్ళింది. ప్రకృతి అందానికి మురిసిపోయినాడు. ఒక్కొక్కప్పుడు తుఫానులవంటి సృష్టివైపరీత్యాలకు భయపడినాడు. చిగురాకు పుట్టుకనుంచి సమస్త సృష్టి చూచి ఆశ్చర్యపడినాడు. ఈ ప్రకృతి దానంతట అదే కలుగు తున్నదా? లేక దీనికి మూలమేమైనా ఉందా? అన్న ప్రశ్నలు ఉదయించాయి.

నాగరికత పెరగడం ఎలా జరిగింది? మానవుడు ప్రతి వస్తువును పరిశీలించి, దాని తత్వాన్ని తెలుసుకొని, వస్తువుల అన్యోన్యత సంబంధం కార్యకారణ సంబంధం సమన్వయపరచుకొంటూ వచ్చిందే నేటి విజ్ఞానం. ప్రకృతిలోని వస్తుతత్వం తెలుసుకొని, అవి తమకు ఎలా ఉపకరిస్తాయో చూచి, అవసరమైతే వాటిని ఆ విధంగా మలచుకొని మానవుడు సుఖం చేకూర్చుకొంటున్నారు. కనుకనే పై ప్రశ్నలను ప్రాక్పశ్చిమ ఖండాల లోని మేధావులుకూడ పలువురు ఆలోచించి సృష్టికి మూలమైన పదార్థం ఒకటున్నదనే నిర్ణయించారు. కొందరు దానినే భగవాను డన్నారు. కొందరు ప్రకృతిపరిణామ మన్నారు.

పద్మాసనం మొదలయిన ఆసనములవల్ల శరీరానికి దార్ఢ్యం కలుగుతుంది. ప్రాణాయామంవల్ల కలుష సంహతులు నశిస్తాయి. ప్రత్యాహార క్రియవలన శరీరం పావన మౌతుంది, ధారణాధ్యానంవలన చిత్తస్థైర్యం కలుగుతుంది ధ్యానంచేత ఈశ్వరుడుదర్శింపగలుగుతాడు, సమాధి వలన కర్మ నిర్మూలనం జరిగి మోక్షం సిద్ధిస్తుంది. ఈ విధంగా యోగాంగ

---

ఇది ప్రకృతి సహజ పరిణామమూ లేక భగవానుని లీలయా అన్న దొక జటిల సమస్య. దానిని చర్చించటానికి ఇది అనువుగాదు. కనుక భగవంతుని అస్తిత్వమే తీసుకొని చర్చించటం జరుగుతుంది.

అయితే ఇక్కడ కొన్ని ప్రశ్నలు మొదలయినవి. భగవంతుడు ఎక్కడ ఉన్నాడు? అతని రూపం ఎలా ఉంటుంది? అతడు చేసే పని ఏమిటి? మనం చూడవలెనంటె ఎలా? ఈ జిజ్ఞాసతోనే వేదాంతుల మేధస్సు తర్కించింది. ఎవరి బుద్ధికి తోచింది, ఎవరెవరి అనుభవాలు, ఎవరెవరు ఏ యే విధానాలు అవలంబించిరి వివరించి చెప్పారు. దీనికి ఆధ్యాత్మికచింతన అంటారు. ఈ పరిశోధన లేకచింతన భారత దేశంలో జరిగినంతగా మరే దేశంలో జరుగలేదని యావత్ప్రపంచం అంగీకరించిన సత్యమే.

సహజంగా విజ్ఞానశాస్త్ర పరిశోధనలు దినదినాభివృద్ధి చెందటం, ఒక కాలంలో శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితాలను ఆధారంచేసుకొని తరువాతి కాలంలో వారు ఇంకా ముందుకు పోవటం జరుగుతుంది. కాని దురదృష్టవశాత్తూ ఆధ్యాత్మిక విజ్ఞాన పరిశోధనలు వందల సంవత్సరాల నాడే ఆగిపోయి ముందుకు జరుగకపోవటం జరిగింది, అనాటి పరిశోధనలన్నీ తప్పులని, అవి వట్టి కట్టుకథలని, కేవలం కొంతమంది తమస్వార్థ

సత్ఫలాన్ని సాధకుడు పొందగలుగుతాడు.


ప్రాణవాయువు ధారణలో దహని, భ్రామణి, స్తంభని, శమని, ప్లావని, అనే అయిదు భాగాలున్నవని పెద్దలు వివరిస్తారు. యోగ సూత్రముకూడ ఉడ్డీయానముద్ర, మహాముద్ర, గగనముద్ర, జాలంధర ముద్ర అని అయిదు విధాలు.

---

ఏర్పరచబడినవన్న భావం ప్రచారంచేయబడుతూ వచ్చింది. ఇటీవలి కాలంలో అది మరీ పెరుగుతూవచ్చింది. చివరకు 'శాతమ్మ జాతీయ మిత్రులవారా! కింజలంకామురుషా!పిలంతి' అని శాస్త్రవిచ్చిన దాని కనుక ఇందులోని తప్పులెక్కయినా సరే భాగవలసిందని ఈ మూర్ఖులు చెబుతున్నారు అని వినిపించేవాక వచ్చింది. కారణ మేమంటే శాస్త్రగ్రంథాలలో చెప్పబడినవని అద్భుత విషయాలుగా కనబడటమే గాక అవి బుద్ధిపూర్వకచగలిగే స్థితిలో అధ్యాత్మిక జ్ఞానసంపన్నులుగూడ లేరు. ఇవి హేతువాదానికి నిలువవని, ప్రచారకుల భావన, వాదన. ఆస్తిసంస్కృతిని ఆదరించేవాళ్ళకుగూడ నేటి విజ్ఞానశాస్త్రపరిశోధనలు, లౌకికుల వాదనలు విన్న తరువాత ఏం చెయ్యాలోతోచని అయోమయ స్థితిలో పడుతున్నారు.

నిజానికి హేతువాదానికి నిలువనిదిలేదు. అసలు మానవుని నాగరికత అభివృద్ధి హేతువాదనతో కలిగినదేగదా! చివరకు అన్ని పురాణములు శాస్త్రములు వ్రాసిన బాదరాయణుడు బ్రహ్మ సూత్రములు ప్రారంభిస్తూ "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అన్నాడు. ఆ తరువాత, ఇందువలన బ్రహ్మ పదార్థమును గురించిన ఆలోచన చేయవలె అని గదా భావం. ఇందులో 'అథః', 'అతః' అనుమానంతో ఎందుకు ప్రయోగింపబడినాయి. ఇందువలన ఆదిలోనే వలెనా కారణాలుండ అని చెప్పబడినట్లు గదా! ఆ తరు

ఇలా సింగళనాడుల సంయోగం చెంది సుషుమ్నను చేరడం మహాముద్ర. గొంతులోని కొండనాలుక వద్దకు జిహ్వను ప్రవేశింపజేసి బ్రహ్మరంధ్ర, భ్రువ, చంద్రమండల విగళితమైన అమృతపానం చేయడమే నభోముద్ర. దీనినే ఖేచరీముద్ర అంటారు. ఉత్తమమైన మహాలింగమును అహోరాత్రాదు నిల్పటానికి ఉడ్డీయానముద్ర సాధనం. వారికాలాన్ని

---

నాక అథః అన్న పదం ప్రాథమిక జ్ఞానమును సంపాదించిన తరువాత బ్రహ్మపదార్థ చర్చకు తగిన స్థాయి పొందగలరని సూచిస్తుంది. కనుక హేతువాదప్రాతిపదిక మీదనే ఆధ్యాత్మిక చర్చ జరిగిందని దాని అవుతున్నది.

అయితే పూర్వ గ్రంథాలలో చెప్పబడిన అపూర్వశక్తులు మానవుడికి లభిస్తాయా? మానవుడంత శక్తిసంపన్నుడవుతాడా? అన్నది ప్రశ్న. దీనికి సూక్ష్మంగా పరిశీలిస్తే మానవుని (ప్రాణి) వంటి విచిత్రమైన యంత్రం మరొకటి లేదు. ఈ దేహంలో ఉన్న చైతన్య పదార్థమేది? ఈ శరీరం ఎలా అన్ని సందర్భాలకు అనుకూలంగా మారుతున్నది? వైద్యశాస్త్రం ఇంత అభివృద్ధిచెందిన రోజులలోకూడ మృత్యువును ఆపలేకపోతున్నారు అని ఆలోచించినపుడు ఎంతటి విజ్ఞాన శాస్త్రవేత్త అయినా ఏదో ఒక అతీతమైన శక్తి ఉంది, అదేమిటో అర్థంకాని స్థితిలో ఉన్నట్లు అంగీకరించక తప్పటంలేదు.

ఇక భగవంతుని గురించిన చర్చ చూదాము. అతడు వాఙ్మనస గోచరుడు. అంటే పంచభూతాలకు అందనివాడు. గుణరహితుడు, ఆకార రహితుడు. మరి ఇలాంటి స్వరూపాన్ని ఎలా దర్శించాలి? పూర్వం మహర్షుల జ్ఞానమార్గంచేత, అనుమానాది ప్రమాణములచేత ఆ పరబ్రహ్మ

ధరించేది జాలంధర ముద్ర. అపానమును బంధించటమే మూలబంధ ముద్ర. ఈ ఐదు ముద్రలు సమాధిసిద్ధకు కారణాలు. బిందుస్థితికి వాయుస్తంభనం కారణం. జీవుని ప్రాణవాయువు పైకి, అపానవాయువు క్రిందికి లాగుతుంటాయి. ఈ విధంగా జీవుడు ప్రాణ అపానములతో సతమత మయ్యేటప్పుడు వాయువును స్తంభింపచేసేటప్పుడు హం అనే

---

స్థితిని పొందుతారు. మరొకటి యోగ మార్గం. ఈ విధానంద్వారా పరతత్వాన్ని దర్శించ వీలవుతుందని తత్వంతెలిసిన మహనీయులు అన్నారు. దీనికూడా ఇంద్రియాలను అదుపులో ఉంచటం ప్రధానం. మానసిక ఏకాగ్రతకు సాధనయే మూలం. 'యోగశ్చిత్తవృత్తినిరోధః' అని అని యోగశాస్త్రాచార్యుడయిన పతంజలి సూత్రం. యోగం సాధనవల్లగాని సిద్ధించదు. అది అభ్యాసవశమైనది. సంపూర్ణంగా విజ్ఞానశాస్త్ర బద్ధమైనదే. మూలాధార, స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ ఆజ్ఞాచక్రము లన్నవి ఇందులోని మెట్లు ఒకదానికొకటి ఊర్ధ్వం. మూలాధార చక్రమునుంచి శేషోరగం (కుండలిని) వెన్నెముకలోని రంధ్రం ద్వారా ఊర్ధ్వగతం చేయటమే యోగసాధన.

కుండలిని ఊర్ధ్వగతం చేయటం వాయువుచేత మాత్రమే సాధ్య మవుతుంది. వాయువును పూరించి, కుంభించి, రేచకము చేయవలె. అంటే గాలిని పీల్చటం, కొంతసేపు నిల్వయుంచటం, అనంతరం విడవటం. దీనికే ప్రాణాయామం అని పేరు. దీనికొక క్రమ విధానం చెప్పబడింది. అభ్యాసం చేత వాయువును కుంభించి ఉంచటానికి వీలుకలుగుతుంది. కుండలిని ఊర్ధ్వగత మవుతున్నపుడు పైన చెప్పబడిన స్వాధిష్ఠాది చక్రముల స్థానముల వద్దకు చేరగానే కొన్ని అద్భుతశక్తులు కలుగుతాయి అని,

విషయాలను చూడగలుగుతారు. ఎంత దూరమయినా శ్రమ లేకుండా ప్రయాణం చేయగలడు. తానంతకు ముందు చదువని, వినని శాస్త్రమయినా వివరిస్తాడు. భౌతిక శరీరాన్ని చిన్నదిగ చేసుకొనగలడు. పరకాయప్రవేశ శక్తి కలుగుతుంది. మృగ, పక్షి, కీటకాదుల భాషలను తెలుసుకొనగలుగుతారు. శరీరాన దివ్యమైన తేజస్సు కలుగుతుంది.

---

అందునా రష్యా చాలా ముందడుగు వేసినట్లు తెలియవస్తున్నది. వారు ఋజువు పరచిన రోజునయినా వీటిపై నమ్మకం కలుగుతుంది.

అది అలా ఉండనివ్వండి. యోగానికి అంగాలు ఎనిమిది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు.

ఇందులో యమమంటే ఆత్మనిగ్రహం. అనగా అంతరింద్రియమైన మనస్సును స్వాధీనం చేసుకొనటం. మనస్సు కోతివలె మిక్కిలి చంచలమైంది. చూచిన వస్తువుల నెల్ల కోరుకొంటుంది. కోరినదానిని పొందటానికి సక్రమ మార్గాన వీలుగాకపోతే అక్రమవిధానమైనా అవలంబించాలని ఆరాటపడి మానవుని దుర్మార్గ ప్రవృత్తికి మళ్ళించే మనస్సును స్వాధీనపరచుకొనటం. యమానికి అహింస, సత్యం, బ్రహ్మచర్యం ఇతర నియమాలు.

నియమం మళ్ళీ అయిదు విధాలు (౧) శౌచం:బాహ్యశుద్ధి, అంతశ్శుద్ధి: (౨) సంతోషం – తుష్టి: (౩) తపస్సు : స్థిరమైన మనస్సుతో క్రమబద్ధంగా నడవటం. (౪) స్వాధ్యాయం:సద్గ్రంథ పఠనము, మంత్ర జపం: (౫) ఈశ్వర ప్రణిధానం : సర్వమును ఈశ్వరుని కర్పించి ఆరు [illegible] త్రుంచివేయటం: ఆసనం : స్థిరమైన విధంగా శరీరాన్ని ఉంచటం.

(02

ద్రుడు ఓంకారేశ్వరుడు కాశీనగరపరంగయోగం తెలిపినవాడు.



వారణాసీపుర సంచారమే ఖేచరీముద్ర. ఆనందకాననవనములో ఉండటమే ఉడ్డీయానముద్ర. కాశీయందు ప్రవహిస్తున్న గంగానదిలో స్నానమొనర్చటమే జాలంధరముద్ర. పరమేశుని రాజరాజధానియందు చేసిన వ్రతాలే మూలబంధముద్ర. ఇవి బాహ్యముద్రలు అవి యోగం వివరించాడు. కలశజుడు అంతతో తృప్తిపడక మహానిగూఢమయిన అయురవసానకాలం గుర్తించే విధం తెలియజెప్పవలసిందని ప్రార్థించాడు. దానికి షణ్ముఖుడు నవ్వి ఇలా అన్నారు.

# అయురవసానకాలం

కుంభసంభవా ఇది అత్యంత రహస్యమయినది. అయినా నీ వంటివాడు ప్రశ్నించినప్పుడు తెల్పకుండటం ధర్మంకాదు.

పింగళానాడి ఎక్కువగ పనిచేయక ఇడానాడిమూలంగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు రెండు చరించే ట్లయితే నరుడు మూడు సంవత్సరాలకు మరణిస్తాడు. మూడహోరాత్రులు గాని, రెండహోరాత్రులుగాని పింగళా నాడియందు మాత్రమే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సాగితే వా రొక్క సంవత్సరంకంటె బ్రతుకడు.

పదిరోజులు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు రెండు నాడులనుంచి రాత్రింబవళ్ళు సమానంగా నడుస్తుంటే మూడు నెలలకే వాడు చనిపోతాడు.

ముక్కుతోగాక, నోటితోనే వాయువు వెలువడేవాడు మూడు రోజులలో మృతుడౌతాడు.

ఎవరికయినా హఠాత్తుగా ఆకసంలో నలుపు పసుపు రంగులుగల  పురుషుడు కనిపిస్తే వాడు రెండు వత్సరాలే జీవిస్తాడు.

మూత్రమెంట వీర్యము,మలమూత్రములు ఒకసారే విడచేవాడు ఒక సంవత్సరం మాత్రం బ్రతుకుతాడు. అరుంధతి, ధ్రువుడు, మాతృమండలమూ కనిపించనివాడు ఆరు నెలలకే మరణిస్తాడు. నలుపు మొదలయిన రంగు మరొక విధంగా కనిపించినా, పులుపు మొదలయిన రుచులు ఇంకొక విధంగా రుచించినా, కనుకొలుకులు తోగరంగు కలిగియున్నా, రాత్రులు ఇంద్రధనుస్సు చూచినా వాడికి ఆయుర్దాయం ఆరునెలంటే గుర్తించాలి. కొండగాలి, ఉవకపెళ్లిగాలి వేగంగా వచ్చి పాదాలనుండి తలవరకు ప్రాకినా, స్నానంచేసిన వెంటనే పాదములయందు హృదయ భాగంలోను తడి వెంటనే ఆరిపోయినా, అద్దపు బింబంలో ఎర్రనికాంతులు చూచినా వారి ఆయుస్సుగూడ ఆరు నెలలే గుర్తించాలి. పీడ కలలు వస్తు, అద్దంలో సూర్యుడు లేక చంద్రుడు కనిపించనపుడు, పగలు నక్షత్రాలు కన్పించి రాత్రులు కనిపించకుండా ఉన్నపుడు, కంట్లు మూయగానే గంధర్వనగర దర్శనం, లేక పిశాచాలు నృత్యంచేసినట్లు కన్పించడం స్వప్నంలో శరీరానికి నూనె పట్టించుకొన్నట్లు, తలగొరిగించుకొన్నట్లు, పిశాచాలు, గాడిదలు, కాకులు, కుక్కలు, గ్రద్దలు, నక్కలు కలలో కనిపించినవారికి మరణం దగ్గరలో ఉన్నట్లు తెలుసుకోవలెను.

ఈ నిమిత్తాలు కనిపిస్తే వెంటనే కాశీ నగరం చేరి, నిరాకారనిర్వికల్ప, నిరస్తసమస్త ఉపాధికుడు నిత్యుడయిన లింగరూపియైన విశ్వేశ్వర సాన్నిధ్యంలో మరణిస్తే ముక్తి కలుగుతుంది అని ఆయుస్సు రహస్యాన్ని కుమారుడు వివరించాడు. ఇదంతా శ్రద్ధగా విన్న అగస్త్యుడు కరవాలినా: వియద్గంగ ప్రవహిస్తున్న మహాక్షేత్రం చెక్కుతు

ముక్కంటిగా లింగముల రూపం ధరించి పరమేశ్వరుడు విలసిల్లుతున్న అవి ముక్తిక్షేత్ర మాహాత్మ్యం ఇంకా వినవలెనని కుతూహలముగా ఉంది అన్నాడు. దానికా శక్తిపుత్రుడు ఎంతో ఉత్సాహంతో ఇలా వివరించాడు.

## దివోదాసు చరిత్రము

పద్మకల్పంలో స్వాయంభువ మనువు కాలంలో ఒకప్పుడు అరవై సంవత్సరాల అనావృష్టి ఏర్పడి గొప్ప కరువు సంభవించింది. ప్రజలంతా అవస్థల పాలయినారు. కొందరు సముద్రతీరాలకు నివాసం మార్చారు. జనులు లేక గ్రామాలు పాడువడిపోయినాయి. నీరు లేక వృక్షాలు మలమలమాడి ఎండాయి. ఆకలి బాధను తట్టుకొనలేక మనుష్యులు క్రూరమృగాలకన్న క్రూరులయి జంతువులను, మనుష్యులనుగూడ చంపితినసాగారు. ఆకలి ఎన్నాళ్ళు సాగుతుంది. క్రమంగా జంతువులు నశించాయి. ప్రజలు బక్కచిక్కినారు. ఎముకల గూళ్ళయినారు. కొందరు మరణించారు. ఈ విపత్యం చూడలేక బ్రహ్మ ఎంతో కలవరపడినాడు. ఆయనకు ఆశ్చర్యం వేసింది. వర్షాలు ఎందుకు కురవటం లేదో ఆయనకు గోచరం కాలేదు.

ఆలోచించగా, ఆలోచించగా విధాతకు ఒక్క కారణం కనిపించింది భూలోకంలో చక్రవర్తి లేడు. రాజులేని రాజ్యంలో ప్రజలు విశృంఖలంగా సంచరించసాగారు. యజ్ఞయాగాదులు మానివేశారు. హవిర్భాగం లేకపోవటంవలన దేవతలు దుర్బలపీడితులయినారు. దానితో పర్జన్యుడు వర్షించ సమర్థుడు కాలేదు. కనుక సమర్థుడయిన వాడిని ఒక్కడిని చూచి భూమండలానికి అధిపతిని చేయాలి అని ఆలోచించాడు.

హస్తి, కాంచి, వెంకటాచలం, శ్రీరంగం, రామేశ్వరం, మొదలయిన దివ్యస్థలాలలో తమ ప్రభువు అంశను చూస్తారు. నానావిధ పుణ్యక్షేత్రాంలోని దేవతలు, యక్షులు, నాగులు దివోదాసుని ఆజ్ఞవిని ఏమిచేయటానికి తోచక కాశీక్షేత్రం చేరారు. గంగాధరుడు ఒద్దిక విడిచిన దేవతాలోకాన్ని చూచి పరమేశ్వరుడు, దేవతలారా! కాలగతిని ఎవ్వరూ మార్చలేరు. నేను కూడా కాశీక్షేత్రం విడిపోతున్నాను. కమలభవుడు లోకహితార్థం సర్వ సర్వం సహా చక్రాన్ని దివోదాసునకు ఇచ్చివేశారు. యక్ష, సురాసుర, కిన్నర, పన్నగ, గరుడాది దివ్యులు ఈలోకాన్ని విడిపోయిక తాను రాజ్యం చేయనన్నాడట ఆ రాజు. విధాత అతనికి అవరం ఇచ్చారు. పితామహుని మాట మనం గౌరవించవలెను. నేను మందరాచలంమీద నివసిస్తాను. దేవతలంతా స్వర్గంచేరండి. పన్నగులు పాతాళం చేరండి అన్నారు. ఈశ్వరుని వచనం పాటించి వారంతా తమతమ లోకాలకు వెళ్ళారు. పరమశివలయుని అంతరంగ భక్తులు మాత్రం త్రిపుండ్రములతో రుద్రాక్ష మాలికలతో శార్దూలచర్మములతో పాటలజటాధారులయి పంచాక్షరి మంత్రపఠనం చేస్తూ పరమేశ్వరుని అనుగమించారు. అగదరీశ్వరుడయిన శంకరుడు మందరాద్రిని పావనంచేయదలచి ప్రయాణం సాగించారు. మందరుడు ఒకప్పుడు ఈశ్వరుని తనపై అధివసించమని వరంకోరుకొన్నాడు.

పార్వతీశ్వరుడు, రత్నాకరేశ్వరుడు, పత్తనాగరేశ్వరుడు శైలేశ్వరుడు, భృంగీశ్వరుడు మొదలయిన మాహేశ్వరులు, జ్యోతిర్లింగ మూర్తులు, లోలార్కకేశవులు, విశాలాక్షి, దుంఠివిఘ్నేశ్వరుడు, దండపాణి ఈశ్వరుని వెంట కదిలారు.

వారంతా లవణసముద్రపరివృతమైన జంబూద్వీపాన్ని దాటి, ఇక్షురసముద్ర పరీతమయిన ప్లక్షద్వీపము పరిగమించారు. సురసముద్ర

పరివేష్టితమయిన శాల్మలి ద్వీపం గడిచారు. ఘృతసముద్రమావృతమైన కుశ ద్వీపం చేరారు. ఆ ద్వీపానికి దక్షిణభాగాన మానసమాగమున్న మందర పర్వతంమీద కనక కందర మాణిక్య విరాజితమయిన ఒక గుహా నిలయంలో పార్వతీ మహేశ్వరులు అధివసించారు. తక్కినవారు అనువైన ప్రదేశాలలో ఆవాసం ఏర్పరచుకొన్నారు.

పవిత్ర గంగా తీరాన నివసించిన దేవతలంతా స్వర్గంచేరారు. దివోదాసుడు భూమిపై ఎక్కడా ఒక చిన్న దేవతనుగూడ నిల్వనీయరాదని కట్టుదిట్టాలు ప్రారంభించాడు. అక్కడక్కడ గల పుణ్యక్షేత్రాలలో దేవతా విగ్రహాలు మాత్రం మిగిలాయి. ధూపాదుల్ని మొదలంటూనవాడు పడిపడ్డారు నాటంతా పాలకహస్తం లభ్ధవాడు.

వసుంధర దేవతారహిత ప్రదేశమైంది. విశ్వేశ్వర ఆలయాలలో స్తోత్రపాఠాలు లేవు. కాశీ పట్టణపు గోష్ఠములలో హృద్యమంత్రజపాలు శూన్యమైనాయి. కారాగారములలో వందనస్తోత్ర పారాయణలు లేవు. విష్ణ్వాలయాలలో ద్వాదశాక్షర జపాలుగాని పురుషసూక్తమంత్రాలుగాని లేవు ఎక్కడా జపాలుగాని, లేక దీపాలుగాని లేవు. కలశజపాలి! ఈ ప్రదేశం చూడాపుగదా. వంపా వినాపాకలేపుని ఎత్తని ఆకాశంలో ప్రకాశిస్తున్న చంద్రరేఖమంటి లాయనాళే అమృత పేదనంలో ఎపుడూ పెరిగిన పూరేడు, నిమ్మ, నారికేళాది వృక్షాలతో ఎంతో హాయి నిచ్చే మందర ప్రదేశం. నిరంతరం మోగుతుండు ఆహ్లాదకరమైన ఈ పాట మందరయందున్న నేనుగూడ దివోదాసుని పంచకలిగిన ఈ వైపరీత్యానికి ఆశ్చర్యపడినాను. తల్లిదండ్రులను చూడవలెనని కోరిక కలిగి నేనుకూడ మందరాద్రికి వెళ్ళాను.

దేవతలను పంపివేసిన తరువాత దివోదాసుడు నానాటికి ముఖ్య

పట్టణంగా చేసుకొని ఎనిమిదివేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. భూమిని వదలిపోలేని కొందరు అల్పదేవతలు దివోదాసుని ప్రార్థించి సేవకులయ్యారు. దైత్య దానవులకు చక్కని అవకాశం కలిగింది. పగవారి శత్రువులు తమకు చుట్టాలుగదా।

భూమిలో నిరాటంకంగా, నిరాతంకంగా దివోదాసుడు రాజ్యం చేస్తున్నాడు. ఉత్సాహ ప్రభుమంత్ర శక్తియుతుడైనాడు. నయవినయములు చూచి చతురుపాయాలు ప్రయోగిస్తూ పరిపాలన కొనసాగిస్తున్నాడు. తన రాజ్యంలో చాతుర్వర్ణములవారు ఆశ్రమ ధర్మాలు నిర్వర్తించేటట్లు చేశాడు.

సంవత్సరాలు గడచినకొద్దీ దేవతలకు వారణాసి విరహార్తి కలిగింది. తమకు కాశీ దర్శనం కావాలంటే ఎలా లభిస్తుంది. దివోదాసున్నంత కాలం అది అసంభవము. కనుక అతనిని రాజ్యంనుంచి తొలగించాలి. దాని మార్గమేమిటి? ఎంత ఆలోచన చేసినా వారిబుద్ధికేమీ తోచలేదు. బృహస్పతి వద్ద కేగారు. ఆయనతో తమబాధను చెప్పుకొన్నారు.

అంగిరసుడు ఇంద్రాది దేవతలనుచూచి గీర్వాణులారా ! ఎందుకు మీకీ విచారం? ఏ కార్యం నెరవేరటానికొక మార్గమున్నది. ప్రాణాపాన, వ్యాన, ఉదాన, సమానములను తృప్తిపరచేది అన్నం. దానికి ప్రాణమనే పేరుకూడా ఉంది. అన్నం సిద్ధం కావటానికి అగ్ని అవశ్యకం. అగ్ని మనలోని వాడేగదా! వాయువు మనం చెప్పినట్లు వినగలడు. వరుణుడు మాత్రం దిక్పతిగాదా। ఈ ముగ్గురు దివోదాసుని రాజ్యంలో తమతమ తేజస్సులను ఉపసంహరిస్తే అతడు మనం చెప్పినట్లు వింటాడు. వరుణ వాయువుల సాయంతో అగ్ని తేజంలేనిదే అన్నం పుష్టికాదు.

ఆలోచించారు. మరలే ఇట్టి పాపకార్యానికి పూనుకోవడం ఎంతో హేయ మయిన పని. వీరి వంశానికి లోబడి దేవతలంతా దాసోహ మనటమా ! ఎంత అవమానకరం! వాడెంతటి శక్తివంతుడు. గీర్వాణులకు మాత్రం తెలియదా ! ఇంత మాత్రానికే దివోదాసుడు వీరి కాళ్ళపైబడి ప్రార్థిస్తాడా? ఒక అగ్ని ఏమిటి? దేవతలందరి శక్తి తానే ధరించి ప్రజలకు ఏ లోటు రానీయకుండా చేయటానికి సామర్థ్యం లేదా ! ఈ విధంగా ఆలోచించి చక్రవర్తి ప్రజలతో ఇలా అన్నారు. ప్రజలారా!మీరు భయపడకండి. ఇదంతా దేవతల కుతంత్రం. యోగసంపదతో నేనే అగ్ని దహనశక్తి కలిగిస్తాను. నిప్పుకల్లు దాస్తే పెండ్లి ఆగిపోతుందిలే అన్నట్లుంది దేవతల ఆలోచన.

నేనే అగ్నిరూపం ధరించి యజ్ఞాలలో హవ్యములు స్వీకరిస్తాను. పర్జన్యుని రూపం ధరించి వర్షిస్తాను. అవసరమయితే సూర్యచంద్రుల ఆకృతులుకూడ నేనే ధరించి దినక్రమం భంగంకాకుండా వెలుగును ప్రసాదిస్తాను. వాయురూపం ధరించి ప్రాణుల అంతర్బహిర్వ్యాప్తిని పొందుతాను. అది ఇది ఎందుకు సమస్త దేవతారూపాలు నేనే ధరిస్తాను. యోగసాధన శక్తితో అంతా నిర్వహిస్తాను. మీరేమి విచారించక మీ మీ గృహాలకు పోండి అని ప్రజలను ఓదార్చి పంపాడు. అనంతరం దివోదాసుడు యోగవిద్యా బలంతో సమస్త దేవతా రూపాలు తానే ధరించాడు. ప్రజలు యథావిధిగా తమతమ కార్యాలు నిర్వర్తిస్తున్నారు. అయితే అయాచితంగా అన్నీ సమృద్ధిగా లభించటంవల్ల ప్రజలలో సోమరితనం ఎక్కువైంది.దాంతో దుష్టభావనలు మనస్సులో చిగురించసాగాయి.

మందర పర్వతంపై ఎంతో సుఖవంతంగాఉన్నా, పరమేశ్వరుడు కాశీని మరచిపోలేక పోతున్నాడు. ఆయనకు కాశీ వియోగం భరించరాని

వ్యాధుడుగా, ఇంకొకమారు దీనుడుగా, ఒక్కొక్కసారి కార్తాంతికుడుగా, పాషండుడుగా, దిగంబరిగా, బ్రహ్మచారిగా, గృహస్థుడుగా నానా రూపాలలో తపనుడు కాశిలో తిరుగాడినాడు. ఎన్ని విధముల ప్రయత్నించినా, రాజానందుగాని, వారణాసిలోని ఆబాలగోపాలం వద్దగాని, చిట్టచివరి కాక వృద్ధురాలియందుగూడ అతడు పొరపు కలుగచేయ లేకపోయినాడు. ఈషత్తయినా అనాచారం కనుగొన లేకపోయినాడు. తను వచ్చినపని విఫలం కాగా దినకరుడు మనస్సులో విచారించాడు.

కార్య సాఫల్యం కాకుండా మందర పర్వతానికి ఎట్లా పోగలను? ఏ ముఖంతో పరమేశ్వరుని చూడగలను? ప్రమథులు నా చేతగానితనానికి హేళన చేయరా? కాశీ వియోగ వ్యథాగ్నిచేత తప్తుడైన శివుడు కలవరిస్తున్నాడు. నా అశక్తతకు అతను కోపిస్తే అడ్డుపడగల వారెవరు? కనుక మందర పర్వతమునకు పోను. కాశియందే కాలం గడుపుదును. హరిశ్చంద్రుడు, దధీచి, శిబి మొదలయినవాళ్ళు కాశిలో నివసించి వారి చింతలను పోగొట్టుకున్నారట. సంసార ఉచ్చులను త్రుంచినారట.

ఇలా ఆలోచించి సూర్యుడు పన్నెండు మూర్తులతో వారణాసిలోనే ఉండిపోయినాడు. ఉత్తరార్కుడు, సాంబాదిత్యుడు, గరుడాదిత్యుడు, మయూఖాదిత్యుడు, ఖఖోల్కాదిత్యుడు, అరుణాదిత్యుడు, వృద్ధాదిత్యుడు, కేశవాదిత్యుడు, విమలాదిత్యుడు, గంగాదిత్యుడు, యమాదిత్యుడు, లోలార్కుడని ఆ మూర్తుల పేర్లు. కాశీ వివాహానికై లోలుడయినాడు కనుక లోలార్కుడయినాడు అని స్కందుడు చెప్పగానే అగస్త్యుడు షణ్ముఖస్వామీ! ద్వాదశాదిత్యుల ప్రభావం వివరింప వలసిందని ప్రార్థించాడు.

దానికి కుమారస్వామి ఆనందపడి ఇలా వివరించాడు.

## ఉత్తరార్కుని ప్రభావం



సూర్యుడిమొక్క ఒక మూర్తి కాశీ పట్టణంలో ఉత్తర దిశన నెలకొన్న కారణాన ఉత్తరార్కుడని పేరు కల్గింది.

కాశీయందు ప్రియవ్రతు డనే బ్రాహ్మణుడున్నాడు. అతను ఒక్కటి సదాచార సంపన్నుడు. శాంతియుతుడు. అతిథి అభ్యాగతులను ఆదరించేవాడు. అతని భార్య శుభవ్రత. పతిభక్తి ఎన్నదగిన సుగుణాలని కల్గాలు. అను కూలవతియైన భార్యతో ప్రియవ్రతుడు గార్హస్థ్య ధర్మాన్ని నిర్వర్తించాడు. కొన్నాళ్ళకు ఆ దంపతులకొక కుమార్తె జనించింది. ఆమె మూలా నక్షత్రం మొదటి పాదాన జన్మించింది. ఈ ఒక్క అశుభ విషయంతక్క మిగతా శుభ లక్షణ శోభవతి. తల్లిదండ్రులా సులక్షణ అని నామకరణం చేశారు. శుక్లపక్ష చంద్రునివలె ఆ బాలిక దినదిన ప్రవర్ధమాన అయి యౌవనవతి అయింది. వివాహ వయస్సు రాలయిన ఆ బాలికనుచూచి తండ్రి, ఈ బిడ్డకు తగిన వరుడెవ్వడు? విశిష్టమైన ఆభిజాత్యం కలవాడు కావాలి అట్టివాడు నాకెక్కడ లభ్యం కాగలడని చింతిస్తుండేవాడు.

మూలా నక్షత్రాన జన్మిస్తే గండం అంటారు పెద్దలు. దాని ప్రభావ మేమో! తండ్రి జ్వరార్తుడై మరణించాడు. అతనిభార్య సహగమనం చేసింది. సులక్షణ ధైర్యం గలది. తల్లిదండ్రులకు ఉత్తరక్రియలు నిర్వర్తింప చేసింది. ఎంతో అల్లారుముద్దుగ పెంచిన జననీజనకులను ఎలా మరువగలను? తల్లిదండ్రులకు కొరగాకున్న నేనిట్ల ఒంటరిగా మనగలుగుతాను? పరమేష్ఠి, నాకీ అతిలోక సౌందర్యం ఎందుకు కూర్చాడు? కులశీలాదులు చూచి నన్ను నేనే ఎవరికైనా వివాహంలో ఎట్లా సమ ర్పించుకొంటాను? ఈ విధంగా విచారించి సులక్షణ బ్రహ్మచర్య దీక్షను బూని ఉత్తరార్కుని కరుణించి ఉగ్రమైన తపస్సు చేయసాగింది. ఏడు

కారణమో ఏనాటి ఋణానుబంధమో ఒక మేక ఆమెతోనే ఉంటూ చెలికత్తె వలె మసలింది.

సులక్షణ నిత్యం ఉత్తరార్క కుండికయందు రేపాటి స్నానమాడి, పగలు నాలుగుజాములు నిండైన భక్తితో పీఠకంఠుని సేవించింది. కొన్ని వత్సరాలకు పీఠకంఠుడు ప్రత్యక్షమై సులక్షణా! నీ భక్తికి సంతసించాను వరాలు కోరుకొమ్మన్నాడు. అంతట సులక్షణ ఇంతకాలం ఈ మేక నాతోనే నివసించి ప్రాణ స్నేహితురాలివలె నన్ను వదలకుండా ఉంది. నోరులేని ఈ ప్రాణికి ముందు వరాలిమ్మని వేడుకొన్నది. ఆ మాటలకు ఈశ్వరుడు హర్షపులకితు డయినాడు. సులక్షణా ఈ మేక రాబోయే జన్మలో కాశీరాజు కుమార్తెగా జనిస్తుంది. అనన్య కరతేరిం తర్వాత మోక్షం పొందుతుంది అని అంతర్హితుడైనాడు.

అనంతర కాలంలో మేక కాశీపట్టణపు రాజుకు నారి అనే పేరుతో కుమార్తెగా జనించింది. సులక్షణను తనమార్కి చెలికత్తెగా, గురువుగా ఆదరించింది. ఈబర్కరీ గాథతో ఉత్తరార్క కుండానికి బర్కరీకుండ మని పేరు కల్గింది.

# షష్ఠాశ్వాసం

## సాంబాదిత్య ప్రభావం

అనంతరం శిఖివాహనుడు అగస్త్యునితో కుంభజా! సాంబాదిత్య ప్రభావం వివరిస్తాను విను.

ద్వాపరాంతంలో దుష్ట దానవులను సంహరించి భూభారాన్ని హరించటానికి శ్రీమన్నారాయణుడు దేవకీ వసుదేవులకు కృష్ణుడుగా జన్మించాడు. నరకాసురుని సంహరించి అతని చెరలో ఉన్న పదహారువేల రాచకన్యలకు విమోచనం కల్పించి వారి కోరికపై వివాహమాడినాడు. వీరుగాక రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, సుదంత, నాగ్నజితి, కాళింది, భద్ర అనే అష్టమహిషులున్నారు. ఒకనాడు దేవర్షియైన నారదుడు ద్వారక చేరినాడు. ఆ సమయంలో బాలుడుగ ఉన్న సాంబుడు అతని దారిలో ఏదో ఆడుకొంటున్నాడు. ఆట కౌతుకంలో అతడు నారదుని రాకను గమనించలేదు. అందువలన తగిన గౌరవమర్యాదలతో స్వాగతం ఇవ్వలేదు. తన తోటి పిల్లలు నమస్కరించి నవ్వుతూంటే సాంబుడు దేవర్షికి నమస్కరించాలని కోరలేదు. నారదునకు ఆ బాలుని ఆంతర్యం నచ్చలేదు. అతడు నేరుగా అంతఃపురానికి వెళ్ళి గోపికావల్లభుని సత్కారం స్వీకరించాడు. ఏవో విషయాలను మాట్లాడుతున్న సమయంలో నారదుడు సాంబుని ప్రస్తావించి అతడు ఉద్ధతుడని చెప్పినాడు. తన మాహాత్మ్యము దర్శించిన నారదుడు స్వర్గమునకు వెడలినాడు. అంతటి మహర్షి కూడ సాంబుడు చేసిన అవజ్ఞ మరచిపోలేక పోయినాడు. ఆ సాంబుని అహంకారానికి తగిన ప్రాయశ్చిత్తం చేయవలెనని సంకల్పించాడు. సమయం కొరకు ఎదురుచూడసాగాడు. తరువాత కొన్నాళ్ళకు ద్వారవతి చేరినాడు. సాంబుని పిలిచి తన రాక శ్రీ కృష్ణునకు తెలియజేయమనిన

ర్నాడు. తండ్రి అంతఃపురంలో ఉండటం తెలిసిన సాంబునకు ఏమి చేయటానికి తోచలేదు. ఆ సమయంలో తండ్రి వద్దకు వెళ్ళితే దోషం. వెళ్ళకపోతే దేవర్షిని అవమానించి నట్లవుతుంది. ఎట్టకేలకు అతడు అనుచితమని తెలిసికూడ తండ్రివద్ద కేగి నారదుని ఆగమనం వివరించాడు. సాంబుడు చేసిన అనుచితానికి కృష్ణుడు కోపించి కుష్ఠురోగ పీడితుడవు కమ్మని శపించాడు. సాంబుడు విచారింపలేదు. తండ్రికీ, నారదునకు నమస్కరించి తాను నిరపరాధినని నమ్రతతో విన్నవించాడు. శాపావసానం తెల్పవలసినదని ప్రార్థించాడు. మురారి మనస్సులో ఎంతో పశ్చాత్తాప పడినాడు. సాంబుని చూచి కుమారా ! కాశీ పట్టణానికేగి విశ్వలంత భక్తితో ఆదిత్యుని ఆరాధించు. నీకు శాపవిముక్తి లభిస్తుంది అని శాపవిమోచన మార్గం వివరించాడు.

సాంబుడు తండ్రి ఆదేశానుసారం కాశీకేగి విశ్వలంత భక్తితో అర్కుని ఆరాధించి కుష్ఠువ్యాధినుంచి విముక్తి పొందాడు. సాంబునిచే ఆరాధింపబడిన ఆ మూర్తి సాంబాదిత్యునిగా ప్రసిద్ధిచెందాడు. ఇలా వివరించి కుమారుడు గరుడాదిత్యప్రభావం వర్ణించాడు.

## గరుడాదిత్య మాహాత్మ్యం

మహాత్మా ! మును బ్రహ్మపుత్రు డయిన కశ్యప ప్రజాపతికి వినత, కద్రువ అనే ఇద్దరు భార్యలున్నారు. కద్రువకు శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, ధృతరాష్ట్రుడు మొదలయిన సర్పశ్రేష్ఠులు పుత్రులుగా జన్మించారు. వినత గర్భాన మూడు అండాలు జనించాయి. కొన్నాళ్ళకు ఒకనాటి సూర్యోదయ సమయాన గూటి పులుగు జనించింది. పక్షి సంతతి కంతటికీ మొట్టమొదటగా జనించిన కారణాన కాశ్యపుడే పక్షులకు రాజయినాడు. అనంతరం దాని స్వభావం తెలియగానే వినతా

నీ దాస్యాన్ని పోగొట్టగలను సుమా! అని అరుణుడు జనని అనుమతి పిదప తారకబ్రహ్మవిధానమయిన కాశికాపురికేగి తపస్సు చేశాడు.

పిమ్మట కొన్నాళ్ళకు ఒకదినం వినతాకద్రువలు సముద్ర తీర ప్రాంతంలో విహరిస్తున్నారు. దూరంగా ఉచ్చైశ్శ్రవం అనే ఇంద్రునిగుర్రం తిరుగుతున్నది. అశ్వాన్నిచూచి వినత ఆహా యెంత చక్కగా ఉంది. మహాపురుషుని కీర్తివలె స్వచ్ఛంగా తెల్లగా ప్రకాశిస్తున్నది అన్నది. ఆ మాటలకు కద్రువ అక్కా నీవేకన్నులతో చూచావోగాని ఆ గుర్రం వాలం మాత్రం నల్లగఉంది చంద్రునిలోని మచ్చవలె ప్రకాశిస్తున్నది అన్నది. ఆ ఇద్దరు వాలం సితమని, కాదు అసితమని వాదులాడి వాదులాడి చివరకు ఓడినవారు దాసీత్వంచేసేటట్లు పన్నిదంవేసుకొన్నారు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. మరునాడు చూతమువెళ్ళమని ఇద్దరు ఇండ్లకేగారు. నిజానికి వాలం ధవళంగానే ఉంది. కద్రువతానలెననే వాలం నల్లగఉందని వాదులాడింది. ఇంటికేగినతరువాత కద్రువ మనస్సులో ఆరాటపడసాగింది. తాను అనృతము పల్కింటిగదా! రేపు నిజంబయటకు రాగలదు. తాను దాసి కావలె. ఆ భావన కలిగేటప్పటికి కద్రువ కంపించిపోయింది. దిక్కుతోచక చివరకు నల్లనిదేహముగల తన బిడ్డలను సర్పములను పిలిచి నేను వినతతో పందెంవేసినాను మీరు కామరూపులు. తిన్నగవెళ్ళి ఉచ్చైశ్శ్రవం తోకవ్రేలాడి తోకనల్లగా కనబడేటట్లుచేసి నన్ను గెలిపించండి. అని కోరింది. ఆమె పుత్రులలో పెక్కుమంది ఈ అకృత్యానికి అంగీకరించలేదు. కద్రువ కోపించి విచక్షణా జ్ఞానంలేక మీరంతా జనమేజయుడనే మహారాజుచేసే సర్పయాగంలో పతించండి అని శపించింది. తల్లి శాపానికి భయపడిన సర్పాలుకొన్ని వెళ్ళి అశ్వంవాలాన్ని పట్టి వ్రేలాడి నల్లగా చేశాయి. మరునాడు వనితలిద్దరు అశ్వాన్ని దూరంనుంచే

చూచారు. శోకవశగా కష్టించింది. ఒప్పందప్రకారం వినత కద్రువకు దాసి అయింది.

అయిదు శతాబ్దాలకాలం గడిచిపోయింది. మూడవ అండాన్ని ఛేదించుకొని మహాసత్వసంపన్నుడు మిగులశక్తివంతుడైన గరుత్మంతుడు జనించాడు. వినతకు ఎన్నో ఉత్తేజకములు కలిగాయి. కద్రువ అంతటి బలవంతుని అదుపుచేసి పల్లకిమోసేగాక సేవకాకార్యములను చేయవలసిందని ఆజ్ఞాపించసాగింది. పౌరుషవంతునికది అవమానకరంగా తోచింది. కద్రువ అలా చేయటానికి కారణం ఏమిటని తల్లిని ప్రశ్నించాడు. ఆమె జరిగినగాథ అంతా వివరించింది. గరుడుడు కొంతసేపు చింతించాడు. సవతితల్లిని, సవతిసోదరులను చేరి దాస్యంవదిలే ఉపాయంచెప్పమని అడిగాడు. నేరాగ గల సర్పరాజులు, కద్రువ అమృతం తెచ్చిఇమ్మని కోరారు. అమితబలం సంపన్నుడయిన గరుడుడు గజకచ్ఛపములను తిని తనఆకలి తీర్చుకొని స్వర్గంచేరాడు. అమృతభాండం తీసుకొనివెళ్ళకుండాచేయటానికి దేవతలు చివరకు దేవేంద్రుడుగూడ గరుడునితో యుద్ధానికి తలపడినారు. ఇంద్రుని వజ్రాయుధమే అతనియందు విఫలమయింది. మహేంద్రుడతనితో సంధి చేసుకొన్నారు. అమృతం సర్పములకు తెచ్చియిచ్చి తల్లిని దాస్యంనుండి విముక్తిగావించాడు గరుత్మంతుడు. కాని సర్పములుదాన్ని వినియోగించక ముందే ఇంద్రుడు మరల అమృతభాండం కొనిపోయి ఉద్ధరించాడు.

వినత కుమారుని తీసుకొని వారణాసి పట్టణానికేగింది. పరమేశ్వరుని అర్చించి ఆరాధించి వారిద్దరు ఇష్టకామ్యములను పొందినారు. గరుడుడు ఆరాధించినరూపం గరుడాదిత్యుడు అని, గరుడుని అగ్రజుడు అరుణుడు ఆరాధించిన స్వరూపం మయూఖాదిత్యుడు అని, వినత భక్తితో పూజించినరూపం ఖఖోల్కాదిత్యుడు అని, అనూరుడు సేవించినరూపం

అరుణాదిత్యుడని ప్రసిద్ధికెక్కినాయి. సూర్యుని కరుణచే అరుణుడు సూర్యునకు సారథి అయినాడు. గరుడుడు తపోమహిమచేత నారాయణునకు వాహనమైనాడు.

# వృద్ధాదిత్య, విమలాదిత్య, గంగాదిత్య, యమునాదిత్య మాహాత్మ్యం

అగస్త్యమహర్షీ! తక్కిన ఆదిత్యుల ప్రభావంకూడ వివరిస్తాను. శ్రద్ధగా వినమని కుమారస్వామి ఆదిత్యప్రభావం చెప్పనారంభించాడు.

పూర్వం హారీతుడనేమహర్షి ఉండేవాడు. కాలగమనంలో అతడు వృద్ధుడయినాడు. కాని అతనికి యౌవన సుఖములయందు వాంఛలు నశించలేదు. తరుణత్వాన్ని కోరి అతడు సూర్యునారాధించాడు. రవి ప్రత్యక్షమై అతనికి యౌవనం ప్రసాదించాడు. అతడర్చించిన మూర్తియే వృద్ధాదిత్యుడనేపేరుతో ప్రసిద్ధికెక్కాడు.

పూర్వం విమలుడనేరాజు ప్రజలను కన్నబిడ్డలవలె పాలిస్తున్నాడు. ఎంతో సహృదయుడు. కాని పూర్వజన్మ కృతమేమో అతనికి కుష్ఠువ్యాధి సంభవించింది. అతడారోగంతో బాధపడుతుండగా ఒకనాడు ఒక మునీశ్వరుడు అతనికడకు వచ్చాడు. తాపసికి రాజు అతిథిమర్యాదలు జరిపాడు. నరనాథుని విచారంచూచిన మునీశ్వరుడు రాజా! నీమనస్సులోని బాధ నాకు అవగతమైంది. నీవు వారణాసికేగి ఆదిత్యుని ఉపాసించవలసింది. నీకీ కుష్ఠరోగమునుండి విముక్తి కలుగుతుంది అనిచెప్పి వెడలినాడు. విమలుడు తాపసికి నమస్కరించి వారణాసికేగినాడు. కాశిలోరాజు గంగయందు స్నానంచేసి నిశ్చలభక్తితో తపనుని ప్రార్థించాడు. దినరాజు కరుణించి ప్రత్యక్షమై అతని మహారోగము పోగొట్టాడు. విమలు డారాధించిన

వర్ణించబడినమూర్తికి విమలాదిత్యుడనే పేరువచ్చింది. ఇక గంగాదిత్యుని చరిత్రవినుమ.

పూర్వం సగరుడనే చక్రవర్తి భూమిని పాలించాడు. అతడు తొంభైతొమ్మిది అశ్వమేధయాగాలు చేశాడు. నూరవయజ్ఞం తలపెట్టాడు. శతాశ్వమేధాలు పూర్తిచేసి సగరుడు ఇంద్రత్వం అపేక్షిస్తాడేమోననే భయంతో ఇంద్రుడు యాగాశ్వాన్ని అదృశ్యంచేసి తీసుకొనిపోయి పాతాళలోకంలోని కపిల మహాముని ప్రక్కన కట్టివైచి వెడలిపోయినాడు. అశ్వాన్ని వెదకుతూ సగరుని అరవైవేలమంది కుమారులు అన్ని ప్రదేశాలుచూచి చివరకు పాతాళలోకం చేరగలందులకు గోయిత్రవ్వినారు. ఆగోయియే నేడు నీటితో నిండబడి సముద్రంఅయింది. సగరుని పుత్రులచే త్రవ్వబడింది గనుకనే దానికి సాగరమనే పేరుకలిగింది.

తాము త్రవ్వినమార్గం ద్వారా సగరపుత్రులు పాతాళంచేరి కపిల మహాముని ప్రక్కన కట్టివేయబడి ఉన్న అశ్వాన్నిచూచారు. దేవేంద్రుని మోసం తెలియని సగరపుత్రులు కపిలుడే అశ్వాన్ని దొంగిలించాడని, తమ రాకచూచి కపిలుడు భయపడి కన్నులుమూసి దొంగతపస్వివలె నటిస్తున్నాడని భ్రమపడ్డారు. కపిలుని చుట్టూచేరి కఠినంగా మాట్లాడారు. వారి సందడికి అర్భాటాలకు కపిలుని ధ్యానభంగమైంది. కోపంతో కండ్లుతెరిచాడు. అతని నేత్రాగ్నికి అరవైవేలమంది క్షణకాలంలో భస్మమయినారు. సగరపుత్రులు ఎన్నాళ్ళకు రాకపోవటంవల్ల సగరుని మనుమడు అంశుమంతుడు అశ్వాన్ని తెచ్చి తాతచేత యజ్ఞాన్ని పూర్తిచేయించాడు. అనంతరం కపిలుని నేత్రాగ్నిలో భస్మమయిన పితృదేవతలకు ఊర్ధ్వలోకాల ప్రసాదించవలసిందని అంశుమంతుడు కపిలుని ప్రార్థించాడు. కపిలుడు దయార్ద్రచిత్తుడయి "నాయనా! ఈ బూడిదరాసులపై గంగానది

ప్రవహిస్తే వీళ్ళకు స్వర్గం లభిస్తుంది! అని చెప్పాడు. అంశుమంతుడు గంగను గూర్చి తపస్సుచేశాడు. కాని ఫలించకముందే మరణించాడు. అనంతరం అంశుమంతుని కుమారుడు భగీరథుడుగూడ గంగనుగూర్చి తపస్సుచేశాడు. గంగ ప్రత్యక్షమై రాజా! నేను నీ కోరిక తీర్చగలను. కాని ఆకాశంనుండి నేను క్రిందికి వచ్చేటప్పుడు నా పతనవేగాన్ని సహించగలవారు లేరు. ఒక్క మహేశ్వరుడే అందుకు సమర్థుడు. ఆ దేవదేవుని అంగీకరింపచేయవలసిందని చెప్పింది. భగీరథుడు మరల శివుని గురించి తపస్సు ప్రారంభించాడు. మహేశ్వరుడు ప్రత్యక్షమై గంగ తన శిరస్సుపై దిగటానికి అంగీకరించాడు.



హిమవత్పర్వత సానువులపై జడలు విరబోసుకొని పాదములు రెండు ఎడంగా నిలిపాడు శివుడు. శరీరాన్ని పెంచాడు. మల్లయోధునివలె నిలిచాడు శంభుడు. గంగ భూమికి దిగసాగింది. స్త్రీ రూపం ధరించింది. అలలన్నీ వలువలుగా మారినాయి. కలువలు కన్నులయినాయి. పద్మము ముఖమైనది. తుమ్మెదలు అలకలైనవి. తామరతూడులే చేతులయినవి. శైవలమే కేశము లయినాయి. సింగారం ఒలుకుతూ కులుకునడలతో అందాలు చిందిస్తూ గంగ దిగుతున్నది. సమీపంలో పార్వతి ఈ వింత చూస్తూ గంగ లలనారూపం దాల్చటంచూసి ఈర్ష్యతో నందీశ్వరునిపై చేయివైచి ఓరగా నిలుచుంది. ఎకాయెకిన గంగ శివుని శిరస్సుపై దిగింది. శివుడు జటాజూటం ముడిచాడు. నీటిచుక్క వెలికిరాలేదు. భగీరథుడు పరమేశ్వరుని ప్రార్థించాడు. శివుడు ఒక జడను సడలించాడు. గంగ హిమవన్నగముపైకి దిగి అక్కడనుండి భూమికి దిగింది. భగీరథుని వెంట పాతాళమునకు ప్రవహింపసాగింది. గంగ ప్రవహిస్తున్న మార్గంలో జహ్నుమహాముని ఆశ్రమముండింది. ప్రవాహం

వెల్లువతో ఆశ్రమం మునిగింది. జహ్నుడు కోపించి గంగాజలాన్ని త్రాగివేయసాగినాడు. కొంతసమయంలోయి భగీరథుడు వెనుతిరిగి చూచాడు. గంగాప్రవాహం కనిపించలేదు. విచారంతో భగీరథుడు వెనుకకు నడచి చూడగా గంగనీటిని జహ్నుమహాముని త్రాగుతున్నారు. ఆ దృశ్యం చూడగానే భగీరథుని మనస్సు విచారభరమవటంతో జహ్నుని కడకేగి ప్రార్థించాడు. తన పూర్వులకు మోక్షంకలిగేటట్లు చేయమని వేడుకొన్నాడు. దయార్ద్రహృదయుడైన జహ్నుడు తాను త్రాగిననీటిని చెవి నుండి వదలినాడు. ఎట్టకేలకు గంగ పాతాళంచేరింది. సగరుల భస్మ రాశింపై ప్రవహించింది. వారంతా ఊర్ధ్వలోకవాసులయినారు. భగీరథుని కోరికతీరింది. భగీరథునిచే కొనిరాబడింది గనుక భాగీరథి అని పిలువబడింది. జహ్నుని కర్ణంనుండి వెలువడింది కనుక జాహ్నవి అని పేరందిందిగంగ. భగీరథుని తపస్సునకు మెచ్చుకొనుచూ దిగుతున్న గంగను సూర్యుడు ప్రస్తుతించాడు. నాటినుండి గంగాదిత్యుడని పిలువబడినాడు.

యమతీర్థంలో యముడు తండ్రియైన ఆదిత్యునిగూర్చి తపస్సుచేసి అనుగ్రహింపబడినాడు. ఆ మూర్తియే యమాదిత్యుడు. అగస్త్యమహర్షీ! ఈ విధంగా భానుడు ద్వాదశమూర్తులయి లోకాలను అనుగ్రహిస్తున్నాడు. ఇక దివోదాసు పతనం ఎలా జరిగిందో వివరిస్తాను విను.

ఆదిత్యుడుకూడ కాశికి తిరిగిరాకపోవటంతో వ్యాకులితుడైన పరమేశ్వరుడు మిగుల చింతాక్రాంతుడయినాడు. కాశీవృత్తాంతం తెలుసుకొనవలెనని కుతూహలం ఎక్కువకాగా వినాయకుని స్మరించాడు. తండ్రికే తలపు తెలుసుకొనివచ్చి పరమేశ్వరునకు నమస్కరించాడు. శివుడతనితో విరించి! యోగినీబృందం పోయినవారిగా పోయింది. కమలబాంధవుడు ఏమయినాడో తెలియటంలేదు. నీవైనా కాశీకేగి దివోదాసుని ప్రశాంత

మూర్తి వైరి ఆ వార్త వెంటనే నాకు వివరింపవలసిందని ఆదేశించాడు. పరమేశ్వరునివద్ద సెలవుతీసికొని బ్రహ్మ వృద్ధబ్రాహ్మణుని రూపంతో కాశీచేరినాడు. దివోదాసుని కొలువుకుపోయి ఆ తని ని వేదమంత్ర పురస్సరంగా ఆశీర్వదించాడు. రాజు వృద్ధబ్రాహ్మణునకు ఎంతో గౌరవంతో అతిథి సత్కారంచేశాడు. రాజు సపర్యలకు చతుర్ముఖుడు సంతసించాడు. అతనితో,దివోదాస చక్రవర్తీ! ఆనందకాననంలో నేను యజ్ఞంచేయదలచాను. నీవు అనుమతి ఈయవలసింది. రాజ ధర్మాన్ని నడిపించవలెనుగదా! చూడు. విశ్వనాథుడు లేకకాశీ అనదపోలె కన్పిస్తున్నది. దేవతలు ఎవరువచ్చినా రాకున్నా విశ్వనాథుని రప్పించవలెనుమా! అన్నాడు.



దివోదాసు ఆ బ్రాహ్మణుని మాటలకు బొనని కాదని అనక ఊరుకున్నాడు. మౌనం అర్ధాంగీకారంగా గ్రహించి విధాత దశాశ్వమేధ యాగాలు నిర్వర్తించాడు. బ్రహ్మ ప్రతిష్ఠించిన మూర్తి బ్రహ్మేశ్వర స్వామి అని పిలువబడినాడు. పరమేష్ఠి కాశీలో యజ్ఞాలు పూర్తిచేస్తున్నాడు. కాని, కాశీ నగర వృత్తాంతం పరమేశ్వరునకు తెలియపరచలేదు. అయినను శివుడు పద్మసంభవునిపై కోపించలేదు. రాజమౌళి మూర్త్యంతరంగదా బ్రహ్మ. అంత గౌరీశుడు మనస్సులో, పోయిన దేవతలంతా కాశీవిడచి రావటంలేదు. కారణం తెలియటంలేదని మిక్కిలి విశ్వాసపాత్రులయిన ప్రమథులను పంపటానికి యోచనచేశాడు. ఒకనాడు శంకుకర్ణుని, మహోదరుని, సోమనందిని, నందిషేణుని, పింగళుని, కుక్కుటుని ఇతరత కొందరు ప్రమథులను వారణాసికి పంపాడు. కాని ఏమి కారణమో గాని, ఆనందకాననం చేరగానే ప్రమథులు ఒడలు తెలియని సంతోషంతో ఉన్నారు. ఇక్కడి విషయాలు ఈశ్వరునకు కబురు పంపవలెనన్న భావనే రాలేదు. శివారాధనతో తక్కిన వన్ని

మరచారు. శృంగారమున లౌకిక వాసనలు వదలి వైరాగ్యభావం కలుగ టం సహజమే గదా. గణనాథులంతా తమతమ నామములపై వేర్వేరు లింగములను ప్రతిష్ఠించి స్వామిని అర్చించారు. అందులో కపర్ది అనే ప్రమథుడు ప్రతిష్ఠించిన కపర్దీశ్వర మాహాత్మ్యం వివరిస్తాను. అగస్త్య మునీ విను అని కుమారుడు తరువాతి కథను వివరింపసాగాడు.

కాశికి ఉత్తరదిగ్భాగాన విమలోదకం అనే సరస్సు ఉంది. అది అన్ని కాలములలో స్వచ్ఛమయిన నీటితో నిండి ఉంటుంది. వికసిత కమలాలతో ఆ సరస్సు మనస్సుకు ఎంతో ఆహ్లాదం కలిగిస్తూ ఉంటుంది. అందలి నీరు త్రాగినా, అందులో స్నానంచేసినా, ఆ నీటితో పితృదేవతలకు తర్పణ విడిచినా ఎటువంటి పాపాలు పటాపంచలు కాగలవు. త్రేతాయుగంలో వాల్మీకి అనే శివభక్తుడుండేవాడు. అతడు హేమంత ఋతువు కాలంలో నిత్యం ఈ సరస్సులో స్నానమాడేవాడు. శరీరం నిండా భస్మమలది రుద్రాక్షమాలికలు ధరించేవాడు. స్థిరాసనుడై పంచా క్షరి పంచబ్రహ్మ శతరుద్రీయ మంత్రాలతో పరమేశ్వరుని ఆరాధించేవాడు. చచ్చుట, చచ్చుటం, షట్పితా పుత్రిక మొదలయిన తాళములతో నాట్యం చేసేవాడు. శంకరాభరణం, రాగరాగాంగ, భాషాంగ, క్రియాంగ, ఉపాంగాది దేశరాగాలలో గీతములను పాడుతూ, దత్తిలం, కోహళ, భరత, మతంగ, నందికేశ్వర మతానుసారంగా వివిధ ప్రబంధాలు నిర్మించి బహు విధములయిన దేశిమార్గ లాస్యతాండవం చేస్తూ ముక్కంటిని విశేషమైన యోగంతో చింతించేవాడు.

ఒకనాడు హేమంతకంపు వెరుల్లుతూ, వణికింపు కలిగించే ఆకా రంతో ఒక రాక్షసుడు వాల్మీకి ఉన్న ప్రదేశానికి వచ్చాడు. కొర్రమూతి, మిడిగ్రుడ్లు, దొప్పచెవులు, కొర్రచేతులు, తాడపైన తల, రోమములోంటి

చెక్కిళ్ళు, ముడతలుపడిన నుదురు, ముడుచుకొనిపోయిన ఛాతి, లెక్కపెట్టటానికి వీలుగా కనబడే ప్రక్కటెముకలు, వీపుకు అతుకుకొనిపోయిన పొట్ట, తీగవలె సాగుతున్న పొలిపొంగ, అస్థి చర్మము మాత్రం మిగిలిన దేహంతో రక్కసుడు ఋషి ఎదుట నిలిచాడు.

వికృతాకారుడయిన రక్కసునిచూచి వాల్మీకి భయములేక నీవెవ్వరని హుంకరించి ప్రశ్నించారు. రాక్షసుడు బదులుపల్కలేదు. తిరిగి వాల్మీకి ఓరీ నీవెవరవు? ఎక్కడనుంచి ఇక్కడకు వచ్చినావు? నీకేం ఏమికావాలి? అని గద్దించారు. అయినా అతడు పల్కలేదు. ఓరీ! ఏలమూర్ఖుడవు? భూతప్రేతపిశాచాలలోని వాడివా? మేము రుద్రాక్ష మాలికాధారులము. పాశుపతమంత్ర జపరక్షావజ్ర కవచం గలవారము. మాబోంట్లను మీరు భయపెట్టలేరు. దూరంగా నిలువు. అని కఠినంగాపలికారు. అప్పుడు రాక్షసుడు హీనస్వరంతో ఇలా అన్నాడు.

«అయ్యా! మహేశ్వరా! మిమ్ములను బెదిరించటానికి నేను రాలేదు. నాదొక దీనచరిత్ర. గోదావరి ఒడ్డునగల ప్రతిష్ఠానపురంలో ఒక బ్రాహ్మణునకు కుమారుడనై జన్మించాను. ధనసంపాదనమే ముఖ్యమని తలపోశాను. పట్టగూడని దానములను పరిగ్రహించాను. ఆ పాపంవలన నాకీ బ్రహ్మరాక్షసరూపం కలిగింది. ఎండలకు వానలకు చాలకాలం బాధపడినాను. నాకు ఆహారంగాని నిలువటానికి నీడగానిలేదు. ఎక్కడెక్కడో తిరుగుతున్నాను. ఎవ్వడయినా ఈ ప్రపంచంలో అనాచారుడుంటే అతనిని ఆలంబనంగా తీసుకుందామనుకొన్నాను. కాని అలాటివాడు నాకు లభించలేదు. ఎన్ని సంవత్సరాలనుంచో ఇలా ఆధారం దొరకక తిరుగుతున్నాను.

ఒకనాడొక దురాచారుని చూచాను. అతడుగూడ ఒక విప్రుడు. సూర్యోదయానికి పూర్వం ఎన్నడూ నిద్రలేచి ఎరుగడు. సంధ్యావార్చడు.

